

హరిజనసేవ ఒక ధార్మిక కార్యం అది కేవలం త్యాగం ధ్యానాల వల్లనే సాధ్యం హరిజనులను మనం దరికన్న అధికులుగా భావించాలి ఎందుకంటే వారిమీద ఎంత అన్యాయం అక్రమం ఉపేక్ష జరిగినా వారు మన తోనే మన ధర్మంతోనే వున్నారు ఇది అద్భుతమైన విష్ట వారితో మన సంబంధ బాంధవ్యం పెంచుకొని ఆదు కోవాలి

హరిజనులలో ఆత్మాభిమానము ఆత్మగౌరవాదులను నిర్మించడం వారిని ఆదర్శ పౌరులుగా తీర్చిదిద్దడం పరిశుభ్రత, పరిశ్రమ విద్యా, సదాచారములను

"హిందువులంతా ఒకటే.
అధికులూ లేరు అల్పులూ లేరు
హరిజన గిరిజనులు హిందూ
సమాజమున అంగభూతులు"

— మహాత్మాగాంధీ.

అలవరచడం—ఇదే సరియైన హరిజనోద్ధరణ. ఇందుకు త్యాగం, సహనం, శ్రమ ఇత్యాదు లావశ్యకం. హరిజనోద్ధరణ కార్యానికి ఉన్నత ధార్మిక లక్ష్యాలు గల లక్షలాది స్త్రీ పురుషుల కేంద్రీకృత శక్తి అవశ్యకం.

హరిజనోద్ధరణ మానవత్వంతో కూడుకున్న ఉద్యమం. మనమంతా మన విరామ సమయాలను దీనికి వినియోగించాలి ఇది దబ్బిచ్చి కూలీలతో జరిపించుకొన దగు కృషి కాదు. స్వయం ప్రేరణతో జరుగవలసిన కార్యం. మనం విద్యాలయాలలో అభ్యసించిన విద్యకిది పరీక్ష.

సాంఘిక సంక్షేమ శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాదు.

# వారికి నేర్పండి పొదుపు

## అది వారి భావినిర్మాణానికి మదుపు !

ఈ రోజు వారికి ఏ చీకూ చింతా లేదు గాని, రేపటి మాట ఏమిటి? రాబోవు కాలాన్ని ధైర్యంగా ఎదుర్కొనేటట్లు సిద్ధం చేయండి భవిష్యత్తుకై పొదుపుచేయ నేర్పండి. స్టేట్ బ్యాంకుతో అదా చేయడం నేర్పించండి.

స్టేట్ బ్యాంక్
సేవ నిమిత్తం



Aiyars S. 271

# తొలిమాట

ఈ పంచికను ఆలస్యంగానే అందచేయవలసి వస్తోందని పాఠకులకు, ఏజంట్లకు క్రిందటిసారే మనవి చేశాం. అగష్టు పంచిక ముద్రణ కూడ వెంటనే ప్రారంభించాము కాబట్టి అగష్టు పంచికను సకాలంలోనే మీ ముందుంచగలమని హామీ ఇస్తున్నాము దీనికంతటికీ ముఖ్యకారణం పేపరు కొరతే.

• • •

విద్యార్థులకు ఇష్టమున్నా, లేకపోయినా వారికి తోటివిద్యార్థుల నాయకత్వం ఎలా అంటకట్టేది — శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారు వ్రాసిన 'ఆశించని నాయకత్వం' చదవండి. (చూ. పే. 11)

• • •

మనం చిన్నప్పుడు ఆవు-పులి కథ చదువుకున్నాం. దాన్ని రివైజ్‌చేసి బీనాదేవి గారు వ్రాసిన కథ (చూ. పే. 88)



సచిత్ర మాస పత్రిక

41 బి బర్కిట్ రోడ్

టి నగర్ మద్రాసు-17

విడి ప్రతి వెల

1 రూపాయి

ఏడాది చందా

పన్నెండు రూపాయలు

సంపుటి 8

జూలై 1970

సంచిక 7

మేనేజింగ్ ఎడిటర్

వి వి రాఘవయ్య.

Edited and Published by V V Raghavaiah and Printed by K Domodaram at Sri Kala Printers, 83 Lake view Road Madras 33

# ఏజంట్లు కావలెను.

ఈ దిగువ ప్రాంతాలలో ధరావతు కట్టి తమ స్వంత బాధ్యతపై జ్యోతి మాసపత్రికను విక్రయించుటకు ఏజంట్లు కావాలి.

1. కృష్ణాజిల్లా
హనుమాన్‌జంక్షన్
నందిగామ
నూజివీడు
జగ్గయ్యపేట
పామర్రు
పెనమలూరు
అరుగొలను
కొండపల్లి
నూవికొండ
గుడివాడ

2. చిత్తూరుజిల్లా
కాళహస్తి
వాయల్పాడు
బి. కొత్తకోట
కలికిరి
పీలేరు
పుంగమూరు
వత్తివేడు

3. కడపజిల్లా
పులివెందల

4. తూర్పు గోదావరిజిల్లా
అనపర్తి
గొల్లలమామిడాడ
రాజోలు
సామర్లకోట
మోరి
రామేశ్వరం

5. పశ్చిమ గోదావరిజిల్లా
ఆకివీడు
కొవ్వూరు
నిడదవోలు
అరవల్లి
పోలవరం
గణపవరం
పెనుగొండ
గుండుగొలను

6. గుంటూరుజిల్లా
చీరాల
కొల్లూరు
చిలకలూరిపేట
పొన్నూరు
పెదనందిపాడు
పేదరమెట్ల
చిలువూరు
చేబ్రోలు
ఈమని
ఇంకొల్లు
కొల్లూరు
పెదకూరపాడు
టంగుటూరు

7 ఖమ్మంజిల్లా

భద్రాచలం
కొత్తగూడెం
చర్ల
మధిర
సత్తుపల్లి

8 కర్నూలు జిల్లా

కంభం
ఆదోని
ఆళ్ళగడ్డ
బంగనపల్లి
డోన్
నందికొట్కూరు

కరీంనగర్ జిల్లా

హుజూరాబాద్
జగిత్యాల
పెదపల్లి

10 మెదక్

సిద్దిపేట

11 నల్గొండజిల్లా

కోదాడ
మిర్యాలగూడ
భోనగిరి
దేవరకొండ

12 నెల్లూరుజిల్లా

బిట్రగుంట
అల్లూరు
పొదలకూరు
బుచ్చిరెడ్డిపాలెం
కోట
నాయుడుపేట

13 నిజామాబాదు

షక్కర్‌నగర్
ఆర్మూరు
బాన్‌స్వాడ
బోధన్

వివరాలకు

సర్క్యులేషన్ మేనేజరు,

జ్యోతి

41 బి బర్కిట్ రోడ్డు

టి నగర్ మద్రాసు - 17




పత్రిక నడపడంలో వెరైటీ చూపించాలి చిత్రకారుల విషయంలో ఆ వెరైటీ చూపిస్తున్నారు బాగానే ఉంది కానీ మీ రిచ్చిన అవకాశాన్ని చిత్రకారులు వినియోగించుకోవటం లేదేమో ననిపిస్తోంది బొమ్మలు అందంగా ఆకర్షణీయంగా ఉండటంలేదు ఆంధ్ర దేశంలో ఎందరో చక్కటి చిత్రకారులున్నారు వారిని మీరు ప్రోత్సహించ కూడదా?

ఒక బాధ్యత మనిషికి స్పష్టంగా కంటికి కనిపిస్తున్నప్పుడు మనిషికి చేతకానితనం జ్ఞాపకం రాదు ప్రగార బ్రహ్మచర్యం ప్రచండ సాగరం కథ బాగుంది

— విద్యాకుమారి

హైదరాబాదు-36

పేద కుటుంబంలో సూర్యుని వంటిది ఆతివిష్ణుగారి సీరియల్ అదీగాక కండ్లకు కట్టినట్లుగా సహజ సంభాషణా సహితంగా వాస్తవానికి చాలా దగ్గిరలో మలచబడింది ఇతివృత్తం

ధారాళంగా సాగుతున్న 'ఆకలి కేకలు' సీరియల్ మధురంగా ఉంది

వాస్తవాన్ని కండ్లారా చూచి "కథ రాయొచ్చు" అని శ్రీధరమూర్తి గారికి సలహా ఇచ్చిన విశ్వనాథం గారికి నా ధన్యవాదాలు

ఇలాగే పేదల భయంకర బాధల్ని బాహ్యంగా చూపించి వారి పురోభివృద్ధికి రచయితలు తోడ్పడ్తారని ఆశిద్దాం

"రుమాలు మీది గులాబి" "సరిగంధు పరికిణీ" కథానికలు బాగున్నాయి సంతోషం

చక్కటి రచనలను స్వీకరించిన ఎడిటర్ గారికి హృదయపూర్వకాభి వందనలు తెలుపుతూ

—యన్ ఆర్. తార,

హైదరాబాదు-2

పొరుగింటి పుల్లకూర సామెతగా మీరు మద్రాసుకి మార్చారు జ్యోతి కార్యాలయాన్ని

ఏమైనా మన ప్రదేశం నుండి మనది అని గర్వంగా చెప్పుకొనబడే పత్రికలన్నీ మద్రాసు తరలిపోతున్నాయి మద్రాసులో తయారయిన జూన్ సంచికలో ప్రత్యేకత కనిపించలేదు మద్రాసు మంచి అన్న గొప్ప తప్పితే యద్దనపూడి సులోచనా రాణిగారి ఆకలి కేకలు ఇంటరెష్టింగ్‌గా నడుస్తోంది

— చెన్నూరి కల్పన-రాజశ్రీ.

మిర్యాలగూడ




# ఆశించని నాయకత్వం

సోమంచి యజ్ఞన్నశాస్త్రి...

రెండో వాడితో జోక్యం కలిగించుకోక. తనేమిటో. తన పుస్తకాలేమిటో చూసుకుంటూ సాఫీగా జీవితం సాగిస్తున్న కాలేజి విద్యార్థి ఓనాడు అకస్మాత్తుగా నాయకుడయి కూచున్నాడు. అది దేశ స్వాతంత్ర్య పోరాటం పేరిట రకరకాల సత్యాగ్రహాలు సాగుతున్న రోజులు ఏ సందర్భంలో పేరు తెచ్చుకున్నా. గిరగిర తిరిగి. రాజకీయ సుడిగుండంలో పడి పోవడం ఆ నాటి పరిపాటి.

నేనా నాయకుణ్ణి! నే నేమిటి నాయకుణ్ణి!! అది రామచంద్రం వెనక్కి తిరగ డానికి ప్రయత్నించాడు కాని ముందుకి తోసుకొస్తున్న జనం మొగలో నెట్టుకు పోబడ్డ మనిషిలా. అదక త్తెరలో పోక చెక్కలా రామచంద్రం ఎటూ తప్పించు

కోలేక నాయకుడయి పోయాడు: రాజకీయ నాయకుడు.

రామచంద్రం సినిమాకి భయస్తుడు. ఎవరైనా ఇద్దరు దెబ్బలాడుకుంటూ వుంటే సినిమాలో నాయకులా దూరం నించే చూసి గాభరా పడేవాడు. ఒక్కొక్కప్పుడు సినిమా నాయకులు చేతి కేదయినా అందితే అది పుచ్చుకుని విలన్ నెత్తి మీద ఒక్కటి పెట్టి పెట్టడానికో; ఏకాలో అందితే కరవడానికో ప్రయత్నిస్తారు. రామచంద్రం అదీ చేసేవాడు కాదు కళ్ళు మూసుకుని మథనపడేవాడు. లేకపోతే అర్జునా, ఫల్గుణా అని పిడుగు మంత్రం పఠించేవాడు. మరి ఈ నాయకత్వ గుణం ఎక్కడినించి వొచ్చింది అని మీ మాంస చేస్తే తేలేది. ఏదో పూర్వజన్మ వాసన అని.

సినిమాకి వాసనే రామచంద్రాన్ని బయటకి లాగింది; పూర్వజన్మ వాసన కాకపోయినా. ఈ జన్మ అంతమయిపోయి, అంత్యక్రియలు జరుగుతున్నప్పటి వాసన, జీవుడికి కాక ముక్కుకి మాత్రమే తగిలే వాసన.

రామచంద్రం వుంటున్న హాస్టలులో పేకాట ఆడకూడదని ఓనియమ ముంది. ఆ నియమం సినిమాకి ఎవరూ, ఏ నాడూ పాటించరని అధికారు లందరికీ తెలుసు ఓ కంటితో చూసి వూరుకోడమో, రెండు కళ్ళూ మూసి ఇలాటి ఉల్లంఘనలు కనిపెట్టక పోడమో చేసేవారు. వార్డెనుతో సహా. ఆట ఒక్కొక్క నాడు వార్డెనుకి చిరాకెత్తు కొచ్చేది. పేకాట శృతి మించి రాగాన పడినప్పుడు. 'ఈ ముక్క వేసి వుండ కూడదు. ఆ తురుపు ఎందుకు చెప్పలేదు.'' ఇలాటి ప్రశ్నలు వాగ్యుద్ధాలకీ. ఒక్కొక్కప్పుడు ముష్టి యుద్ధాలకీ దారితీసేవి. వార్డెను పరుగెత్తు కొచ్చి అందరినీ చీవాట్లు పెట్టడమో, మరీ విసిగిపోయిన నాడు: ఫైన్లు వెయ్యడమో చేసేవాడు.

ఓ నాడు రామచంద్రం గదిలో చేరారు పేకాటకి స్నేహితులు. నన్ను చదువుకో నివ్వండిరా అంటే వినలేదు. ''నువ్వు పేకాడవని వార్డెనుకి నీ మీద సదభిప్రాయ ముంది, అంచేత ఇక్కడ ఆడితే మాకేమీ ప్రమాద ముండదు. కిక్కురు మనకుండా గప్‌చిప్‌గా ఆడతాము ప్రేక్షక రూపంలో మా వెనకాల కూచో, లేదా, చదువుకుంటూ మంచం మీద పడుండు వాళ్ళు. అదీ కాకుంటే, శవంలా తగలడు. వాసన మాత్రం కొట్టకు'' అన్నారు ఒక పేకాట అసామీ ఆ హాస్టలుకి అల్లంత దూరంలో స్మశానం వుండడంవల్ల శవాలు తగలపడడం. వాసన కొట్టడం ఆ విద్యార్థులకి కేవలం, వాఙ్మయ ఉపమానాలుగా కాక, ప్రత్యక్షంగా అనుభవాలు.

పేకాట ప్రారంభమయింది, పుస్తకం పుచ్చుకుని రామచంద్రం మంచం మీద ఒరిగాడు. పది నిముషా లయేసరికి పెద్దగా వాదన ప్రారంభమయింది పేకాట రాగస్థుల మధ్య. ఎక్కడినించో అప్పుడే ఇంటికి చేరుకుంటున్న వార్డెనుగారి చెవికి, ఈ రణగొణ ధ్వనిని వాయుదేవుడు చేర్చేశాడు.

వార్డెనుగారికి ఆ రోజున అసలే చికాకుగా వుంది. ఇంట్లో ఆడంగులు వాకిట వుండడం. మొగాళ్ళే చేతులు కాళ్ళు

కోసం పరిపాటిగా వున్న రోజులవి. ఆ రోజున ఆయన చేతులు నిజంగా కాలాయి. వాకిట వున్నందుకు భార్య మీద, నాలుగు మెతుకులు పడకేసి పెట్టడానికి తన కుటుంబంలో మరెవరూ లేనందువల్ల యావత్తు కుటుంబం మీదా, ఇలాటి బాధాకరమైన ఆచారాలు పెట్టినందుకు సమాజం మీద ఆయన మండిపోయి వొళ్ళు చల్లార్చుకునేటందుకు బయటికి వెళ్ళి, పిరాకు పూర్తిగా వొదిలించుకోలేక తిరిగి యిల్లు చేరుకుంటున్న సమయంలో ఇది జరిగింది. చెరాచెరా. ధ్వని వొచ్చిన వైపు పయనించాడు. ఆయన కాళ్ళ చప్పుడు మూసి గదుల అవతలే పసి కట్టిన లోపలి పేకాట రాయుళ్ళు "గప్ చిప్" అయిపోయారు. పేకలు అదృశ్యమయి పోయాయి. అందరి చేతుల్లోకీ పుస్తకా లొచ్చేశాయి. తలుపు మూసేసి వుంది వార్డెన్ తలుపు తట్టాడు; మెల్లిగా. ఎవరూ వినిపించుకుని తియ్యలేదు. దబదబ బాదాడు. ఇదేమీ గమనించకుండా, తన ధ్యాసలోనే వున్న రామచంద్రం లేచి తలుపు తీశాడు. ఎదురుగుండా వార్డెన్, ఆయన వెనక కొంత మంది హాస్టల్ విద్యార్థులు వున్నారు. రామచంద్రం గతుక్కు మన్నాడు. కొంచెం గాభరా పడ్డాడు.

"తలుపెందుకు మూశావు" అని గద్దించాడు వార్డెన్ పుస్తకాలు చేతులో వున్న మనుష్యుల్ని చూసి. ఎందుకు పేకాడు తున్నారు అని దబాయించలేక.

"త....త.. తలుపా" అని నసిగాడు రామచంద్రం.

"అవును తలుపే" అని మళ్ళీ గద్దిం చాడు. "తలుపు మూస్తే ఏం?" అ అడగుదామనుకున్నాడు గాని. ధైర్యం చాల్లేదు రామచంద్రానికి.

బుర్ర గోక్కుంటూ 'శవం చచ్చి పోయింది అందుకు మూశాం'' అన్నాడు దూడ గడ్డికోసం కాడిచెట్టు ఎక్కా అన్న సమాధానం కంటె ఇది కుంటిగ కనిపించింది వార్డెన్ కి. రామచంద్రం అల్లరి చిల్లరి వాడుకాడు. వార్డెన్ తో వేళాకోళం చెయ్య గలిగిన సామర్థ్య మున్న వాడుకాడు.

"శవం చచ్చిపోయిందా" అన్నాడ వార్డెన్.

"అవును, వాసనవేసింది" రామ చంద్రం జవాబు.

"వాసనేసిందా"

"అవును. కావలిస్తే నా ముక్కు వాసనచూడండి." అన్నాడు రామచంద్రం

మరీ అయోమయమయింది వార్డెన్ కి శవం చచ్చిపోడం. వాసన కొట్టడం వాసన రామచంద్రం ముక్కు వాస చూస్తే తెలియడం. ఏమిటీ గొడవ ?

"నోరు మూసుకు తిన్నగా మాట్లాడు" అన్నాడు వార్డెన్.

రామచంద్రానికి వొళ్ళు మండింది. పేద కుదివి చూస్తే మరీ మొత్త బుద్ధి అన్నట్టు న్యాయంగా జవాబిస్తూ వుంటే. తన మీద లేస్తాడేం ఈ వార్డెను.

"నోరు మూసుకుని ఎలా తిన్నగా

మాట్లాడం'' అని గొణిగాడు మరీ పైకి అనడానికి ధైర్యం చాలక'

"షటప్''

దానితో మరీ ఉగ్రుడై పోయాడు రామచంద్రం. వార్డెన్ మీదికి వెళ్లాడు. "చూడండి. వాసన చూడండి'' అని వార్డెన్ ముక్కు మీదికి తన ముక్కు పోనిచ్చాడు. అమృతాంజనం వాసన గుప్పు మంది వార్డెన్‌కి.

"ఏమిటిదంతా. మీకు కెందు కొచ్చావు''

నా ముక్కుకి అమృతాంజనం రాసు కున్నానో లేదో చూపిస్తున్నాను నోటితో చెబితే మీకు తెలీలేదు. అంచేత ముక్కు చూపించాను.

"శవం'' అని కసిగాడు వార్డెన్.

"తగలడుతూంటే వాస నేసింది. భరించలేక; ఆ వాసన పోగొట్టుకోడానికి మరో మార్గం లేక. తలుపు వేశాను. నా ముక్కుకి అమృతాంజనం రాసుకున్నాను. ఇందులో తెలియకపోవడానికి ఏమీ లేదు. అని ధీమాగా జవాబు చెప్పాడు రామచంద్రం. ఇంకా వాదన పెంచు కుంటే లాభం లేదనిపించింది వార్డెన్ గారికి. శవం చచ్చిపోయింది....వాస నేసింది. ముక్కుకి అమృతాంజనం అని గొణుక్కుంటూ వెళ్ళిపోయారు వార్డెన్‌గారు. వార్డెన్ కనుమరుగవగానే రామచంద్రాన్ని అతని ధైర్యసాహసాలకి అభినందిం చడం ప్రారంభించారు "శవం చచ్చిపో యిందని వార్డెన్‌నే హడలగొట్టేశావురా. గట్టివాడివి శవం చచ్చిపోవడం అంటే ఏమిటిరా?'' అన్నారు స్నేహితులు.

ఇప్పుడు అర్థమయింది రామచంద్రానికి తన తప్పు. మనిషి చచ్చిపోయాడు. శవం తగలడుతోంది అనడానికి మాటలు తడబడి, శవం చచ్చిపోయింది అన్నాడు. వార్డెన్ ఏమనుకున్నాడో గాభరాపుట్టింది. కాళ్ళు వణికాయి. వెళ్ళి వార్డెన్‌తో చెప్పు కుందామనుకున్నాడు. కాని ధైర్యంచాలక బాధతో. చిరునవ్వు నవ్వి. ఏదో సమయ స్ఫూర్తిగా "శవం చచ్చిపోయిందంటే మనిషి చచ్చిపోయి శవం అయాడు అన్న మాట. కంట్రాడిక్షన్ ఫర్ ది కంపేరిజన్. ఓ అర్థాలంకారంలే అన్నాడు. వార్డెన్‌నే ఎదిరించి ఆయన తికమకపడే జవాబు చెప్పిన మొనగాడని రామచంద్రానికి ఆ రాత్రికి రాత్రే పేరొచ్చేసింది ఇది అతని నాయకత్వానికి ప్రథమ సోపానం

ఓ వారం రోజులు తిరక్కుండా అతని నాయకత్వం ఆఖరిమెట్టు ఎక్కి పోయింది. ఓ రాజకీయ నాయకుడొచ్చి. విద్యార్థులను కూడా సత్యాగ్రహ సమ రంలో పాల్గొనవలసిన ఆవశ్యకతని గురించి ఉపన్యాసమిచ్చాడు. శెట్టి హోటల్లో వేడివేడి పెసరట్టు ఉప్మా నంజుకుంటూ తినడానికి వెళ్ళిన రామచంద్రం ఆ మీటిం గుకి హాజరవడం లేదు. రామచంద్రం తిరిగొస్తూ వుంటే గుంపులు గుంపులుగా విద్యార్థులు తిరిగిపోతున్నారు. మరునాడు

కాలేజీలో సమ్మె జరుగుతుందని పుకారు పుట్టింది. ఏంయితే అది జరకుండా చెయ్యాలనికే. అసలా ఎవరెవరు సమ్మెలో చేరతారో తెలుసుకుందామని. రాత్రి పది న్నరకి, హాస్టలులో రూము రూముకీ బయలుదేరాడు వార్డన్. రెండు రూములు అయిపోయాయి. అంతలో విద్యార్థులు సమ్మెలో పాల్గొనటం లేదని అభయమిచ్చారు. మూడో గది రామచంద్రానిది. అతను గాఢ నిద్రలో వున్నాడు వార్డెన్ నాలుగుమాట్లు తలుపు తట్టితేనేగాని రామచంద్రం తలుపు తీయలేదు. కళ్ళు నలుపుకుంటూ వింటున్నాడు. ఆ నిద్రలో ఎదురుగుండా ఉన్నది వార్డెనని కూడా గుర్తు తెలీలేదు.

"ఏం కావాలి?" అన్నాడు ధీమాగా.

"నువ్వు రేపు సమ్మెలో చేరుతున్నావా?" అన్నారు వార్డెన్,

"ఆలోచిస్తాను" అన్నాడు రామచంద్రం.

"సమ్మె రేపే. ఎప్పుడు ఆలోచిస్తావు."

"రేపు ఉదయం కావలసినంత టైముంది. రాత్రి నిద్రపోవడానికి ఆలోచించడానికి కాదు. నాకు నిద్దరగా ఉంది. వస్తుంటా వెళ్ళండి." అని గబుక్కున తలుపు వేశాడు రామచంద్రం. తెల్లబోయి, రాత్రి పరిశోధన చాలించుకుని. ఇంటికి తిరిగిపోయాడు వార్డెన్.

హాస్టల్ ఆవరణలో పెద్ద గొడవ.

నిద్రపట్టక బయటకొచ్చాడు రామచంద్రం. విద్యార్థులందరూ చుట్టుముట్టేరు. అతని ధైర్య సాహసాలకి అభినందించారు. పాతికేళ్ళ ఈమత్య. వార్డెన్ ఈ విధంగా హడలగొట్టిన మనిషే లే న్నారు. రేపటి సత్యాగ్రహానికి నువ్వే మా నాయకుడివన్నారు. రామచంద్ర కాళ్ళు వొణికాయి, నిద్రలో లేపెయ్యడ వల్ల. మత్తులో. అలా మాట్లాడా క్షమించాలి. అని వార్డెన్‌తో చెప్పుకుం మనుకున్నాడు ఆ మొహం నేనేం వా కున్నా. నాకు సత్యాగ్రహం వొద్దు. ఏ వద్దు. ఇలా వదలవ్వండి అని అభినం స్తున్న విద్యార్థులతో చెబుదామను న్నాడు. భయంచేతో. గాభరావల్లనో నోరు పెగల్లేదు.

హాస్టల్లో రౌడీ సుబ్బన్న "వాళం గొప్పవాడివిరా అని. రామచంద్రాన్ని ఎగరేసి, భుజం మీదికి ఎక్కించుకున్నాడు హాస్టలు ఆవరణంతా పూరేగించాడు

రామచంద్రానికి ముచ్చెమటలు పోశాయి.

కాని, ఏం చెయ్యగలడు!

నాయకుడయిపోయాడు!



# గాలిబ్ రాసిన ఉత్తరాలు

## 4

జనవరి 4, 1852

ఏమి మహరాజ్ !

మున్షీసాహెబ్ ముషాయిరా విన్న అనంతరం నువ్వు నన్ను పూర్తిగా మర్చిపోయినావు .. సుహాగా? సరి . అలీఘడ్‌కి వెళ్తున్నట్లుగాని వెడుతున్నట్లుగాని పూర్తిగా నాకు తెలియలేదు. మంచిది. ఏంచేస్తాం. నేనే ముందు వ్రాస్తున్నాను.

ఇప్పటికయినా నువ్వు నాకు అక్కడి పూర్తి వివరాలు వ్రాస్తావని ఆశిస్తున్నాను. నీ దస్తూరీలో వున్న బాబూసాహెబ్ కవిత్వం నేను చదివాను. బాగున్నాయ్. వీటిని ఏం చెయ్యాలో తెలియక హైరాన పడుతున్నాను ఆగ్రా పత్రిక్కి పంపమని అతను అన్నాడు గాని ఆ కష్టం లేదు అతను భరత్‌పూర్ వచ్చినదాకా వాటిని అలాగే ఉంచుతాను

కనీసం నువ్వు బాగయినా కవిత్వం వ్రాయి పదివాలని వుంది

అసదుల్లా

## 5

21 ఫిబ్రవరి 1852.

చిరకాల మిత్రుడైన హరీ!

నీవు చల్లగా ఉండాలి—నీవు లక్నో వెళ్ళి కవి సమ్మేళనంలో పాల్గొన్నట్లు విన్నాను—నీ చిరునామా తెలియనప్పుడు ఎక్కడికి వ్రాయాలో తెలియక ఊరుకున్నాను. ఈ అయోమయంలో ఆ కాగితాల్ని ఏం చెయ్యాలో తెలియక అలాగే వుంచాను. నీవు అక్బరాబాదు వస్తున్నట్లు ఇవ్వాళ తెలిసింది. అందుకే వెంటనే యీ ఉత్తరం వ్రాస్తున్నాను. ఇవ్వాళ 19. 21 నాటికి యీ ఉత్తరం ఆగ్రా చేరుతుంది.

ఖత

బాబాసాహెబ్‌కి కూడా యీ ఉత్తరం చూపించు—అశ్రద్ధ చేయకుండా ఉత్తరంలో విషయం అమలుచేయండి.

సరే అది అయిపోయింది.

హరచంద్ ఉద్దేశంలో ఏమోగాని మనం మాత్రం శత్రువుల్లో ఔన్నత్యాన్ని గూడా గౌరవించగలం అనే అనుకుంటాను. మనకి విరోధి అయితే అతనిలో గొప్పతనం లోపించాలా ఏమిటి? వాళ్ళు అనుకున్నాగాని మనం సవ్యంగా ప్రవర్తించినంతకాలం ఫరవాలేదు. మనం వ్రాసినదాంట్లోగాని ఆలోచించినదాంట్లోగాని తప్పు లేదు. ప్రపంచ ప్రజల నీతి అవినీతులతోనూ నిజాయితీతోనూ నీకూ నాకూ ఏం పని!

సంస్కార సభ్యతలనేవి మన స్నేహితుల వరకూ పరిమితంగా ఉంటే చాలు. నీకు నేను ఇదివరకు చాలాసార్లు చెప్పాను. ఇప్పుడు మరోసారి చెపుతున్నాను. ఎదుటివాడు ఏదో చేసాడని నీవు విచారించటం మానెయ్యి...ఈనాటి నీ స్థితి ఒక శిఖరాన్ని చేరింది.

అసదుల్లా.

## 6

22 మార్చి 1852.

భక్తశిఖామణీ!

వస్తే మంచిదే—రాకపోతే అంతకంటే మంచిది....పుణ్యంకూడా అంతే నయ్యా స్వామీ.. నా కాలంలో ప్రేమ ఎక్కువగా వుంటే నీ కాలం వచ్చేసరికి నమ్మకంకూడా తగ్గిపోయింది.

మన మానవత్వం....దయా నమ్మకం ఎక్కువ తక్కువ. ఇవన్నీ ఎప్పుడూ ఉన్నవే.

పిచ్చివాడు భగవంతుణ్ణి చూసి ఇలా అన్నాడని ఒక కవిత ఉంది. ఓ భగవంతుడా నీకూ నాకూ భేదం ఏమిటంటే నీలో ధైర్యం లేదు. నాలో ధైర్యంవుంది. నేనుకూడా భగవంతుడితో అదే అంటాను. నేను అప్పుడనీ ప్రకాశహీనుణ్ణి కదా అని నీవు నన్ను గమనించకపోతే ప్రకాశవంతమైన నీ నేత్రాలకి సోరణగండ్లకి భేదం ఏమిటి అని?

బ్రతుకు నరకం కాదని ఒక హిందూకవి అన్నాడు గాని నేను అతనితో ఏకీభవించకుండా ప్రయత్నిస్తే నరకం అవుతుందని అంటున్నాను....ఇది వ్రాద్దామా అని అనిపించిందిగాని మళ్ళీ విరమించుకున్నాను.

నీవు వ్రాసిన ఉత్తరం త్రాగి వ్రాసినట్లు కనిపించి సంతోషించాను. నా కవిత్వంమీద నీ విమర్శకూడా విషాగా వుంది. బ్రతుకుగురించి ఎన్నాళ్ళు మొరపెట్టుకోగలం చెప్పు? తిరగ వ్రాసిన ఆ కవితని తిరిగి పరికించు.

ఆ పుస్తకంలో వ్యాకరణపు గొడవలు విడిచిపెట్టబడ్డవి. వ్యాకరణం వ్రాయడం కన్నా విడిచిపెట్టడం మరింత కష్టం— పెద్దవాళ్ళ తప్పులు ఎన్నకూడదు మరి. మనం తప్పులు పట్టేవాళ్ళం చేసేవాళ్ళం కాదు.

హాఫిజ్ అన్నట్లు....శుభం జరిగే చోటికి దురదృష్టవంతుని మార్గం చేరదు.

సరే ప్రియమిత్రమా మన కవిత్వం గురించి కాలం నిర్ణయిస్తుంది. తప్పు పట్టేందుకే మనం బ్రతకడంలేదు.

యవ్వనపు పొంగుల గురించి సన్యాసికి తెలియదు. ఒక్కొక్క వ్యక్తి కీర్తికి కీర్తి తేగలడు చెప్పలేం. కనక నేనూ విచారించినా మొదలకుండా పూరు కున్నాను. విమర్శకికూడా ఒక అర్థం వుండాలి కవి కీర్తికి మచ్చ తేవటమే విమర్శకుడు పనిగా పెట్టుకోకూడదుగాని అతను పెట్టుకున్నాడు మరి ఏం చేస్తాం?

సూర్యచంద్రులు నశించి కాలం అంతం అయినా కన్నీటికోసం యాచించవద్దు.

నేను కాలాసాహెబ్ యింట్లోంచి వచ్చి చిన్నబస్తీలో వుంటున్నాను. అద్దె ఇవ్వలేకపోవడమే కారణం కాదుగాని... సరే ఈ తడవ వ్రాసే ఉత్తరాలు ఈ చిరునామాకి వ్రాయి. బాబాసాహెబ్ ఎలాగున్నారు? ఏమైనా మారారా? అజ్మీరు మంచి ఆబూకి ఎప్పుడు వెడతారు? సలాంలు.

అసదుల్లా.

# 7

18 జూన్ 1852.

హరీ! గట్లో పెట్టిన చంద్రుడా!

తమరు ఏమేం చేస్తున్నారు ఇప్పుడు... బొత్తిగా తీరకుండా వుంది మీకు.

జైనల్ కొడుకుల్ని నీవు ఎరుగుదువా? ఆ పిల్లల బాధ్యత ఇప్పుడు నామీద పడ్డది. గర్భశోకంతో పాటు ఇదొకటి. జైనల్ పోయిన దగ్గరనుంచీ ధైర్యంగా వుండాలనే ప్రయత్నిస్తున్నాను-ఒట్టు.

కవితా వారసులయితే బాధలేదుగాని ఈ వారసు లలాకాదు. అన్నం తినివ్వరు. మధ్యాహ్నం నిద్రపోనివ్వరు. అందులో ఒకడు నీళ్ళు పారపోస్తాడు. మరొకడు పరుపు చింపుతాడు .. అయితే వాళ్ళనే విసుక్కోను నేను. ఇక కవితా వారసుల్ని గురించి భయం దేనికి? బొత్తిగాలేదు. వెంటనే ఆ కవిత్వాన్ని పంపితే చూస్తాను.

నీ కవిత్వాన్ని ఈశ్వరుడు ఆశీర్వదించాలని ఆశీర్వదిస్తున్నాను. బాబూసాహెబ్ ఉత్తరం కూడా ఈ ఉత్తరంతో పంపిస్తున్నాను. ఆయన కియ్యి. మీ ఆబూ ప్రయాణాన్ని గురించి నాకు తెలియబరుస్తావు గదూ? వీలయితే రావటానికి ప్రయత్నిస్తాను.

అసదుల్లా.

# త్రిశూల శిఖరాలు

(గత సంచిక తరువాయి)

ఆ రోజు—

సాయంత్రం అయింది.

మూర్తి శాస్త్రి అందరూ వెళ్ళిపోయారు.

నేను పత్రాలన్నీ చూసుకుని అర్జెంటుగా సమాధానాలు యివ్వవలసిన వాటికి జవాబులు యిస్తుండటం వల్ల ఆలస్యం అయింది.

ఆఫీసు కాగితాలన్నీ సర్ది డ్రాయరులో పెట్టి గది తలుపులు తాళంవేసి బైటకి వచ్చాను.

సుదర్శనంగారి తర్వాత ఆయన బాధ్యతలన్నీ స్వీకరించిన నేను ప్రతి చిన్న విషయంలో శ్రద్ధగా జాగ్రత్తగా వుండసాగాను.

ఆఫీసులో మొట్టమొదట అడుగు పెట్టే వ్యక్తిని నేను.

సాయంత్రం అందరికంటే ఆలస్యంగా వెళ్ళే వ్యక్తిని కూడా నేనే.

క్రమశిక్షణ కార్యాచరణ యీ రెండూ నాకెంతో యిష్టం.

నాయీ యిష్టం ఆఫీసులో మిగతా అందరికీ చాలా యిబ్బందిగా అనిపించిందని నాకు తెలుసు.

తలుపులు మూసి పరధ్యానంగా ఆలోచిస్తూ బైటకు వచ్చేసరికి అక్కడ వర్కర్స్ అంతా కూర్చుని వున్నారు.

సమయం కాని సమయంలో ఏదో అర్జెంట్ పని వుంటేగాని ఆఫీసువాళ్ళు యిలా రారు. అందులో మూకుమ్మడిగా అందరూ ఒక్కసారి వచ్చారు.

నేను మెరుపులా వాళ్ళందరినీ ఒక్కసారి కలియ చూసాను.

ఏదో అయింది. అందరి ముఖాల్లో భయాందోళనలు స్పష్టంగా ద్యోతకమౌతున్నాయి. వాళ్ళందరినీ చూడగానే ఒక్కక్షణం ఆగాను.

కానీ కళ్ళ వాళ్ళ కోసమే నేను ప్రత్యేకం ఆగినట్టు గాకుండా జేబులో తడుముకుని సిగరెట్ తీసుకుని వెలిగించుకున్నాను.

వాళ్ళు కూడా నేనేదో చాలా ముఖ్యమైన పని చేస్తున్నట్టు సిగరెట్ వెలిగించుకునే వరకూ శ్రద్ధగా గమనిస్తూ నిలబడ్డారు.

సీరియల్

"ఏమిటి విశేషం?" అన్నాను అగ్గి పుల్ల అవతల పారేస్తూ.

"మన ప్రెస్ మూసేస్తున్నారంటగా బాబూ!" వాళ్ళందరికీ పెద్దయిన ఒకతను అడిగాడు.

"ప్రెస్సా! మూసేయటమా? ఎవరు చెప్పారు మీకీ కట్టు కథలు!"

"భాస్కరం బాబు. మధ్యాహ్నం వచ్చి మీ పని అయింది. ప్రెస్ అమ్మేస్తున్నారు. నెత్తిన గుడ్డేసుకు పోవాల్సిందే అంతా అన్నారు.

భాస్కరం అన్నాడా! నాకు వాళ్ళ మూర్ఖత్వానికి జాలివేసింది.

నేను వచ్చిన యీ కొద్ది రోజులకే భాస్కరంలో వున్న చాతుర్యం బాగా గ్రహించాను, కాని కథలు కల్పించటం, గాలిమాటలు పుట్టించటం సృష్టించి ఎప్పుడూ ఎవరినో ఒకరిని ఏడిపిస్తూ వుండటం అతనికి సరదా!

"ఆయన మాటలు మేమంతగా నమ్మలేదు అనుకోండి అయినా తామో!

ఎవరికి తెలుసు! అసలే డబ్బు యిబ్బందుల్లో వున్న మనుష్యులయ్యే!

వాళ్ళిష్టం! అది అబద్ధమో, నిజమో మీరు చెబితే మాకు నమ్మకంగా వుంటుంది"

నా పట్లవాళ్ళకి గల విశ్వాసానికి ముగ్ధుడిని అయాను.

"నాకింతవరకూ తెలియదు. నేను కనుక్కొని రేపు చెబుతాను." అన్నాను.

నేను ఆఫీసునుంచి సరాసరి సుదర్శనంగారింటికి వెళ్ళాను ఆవిడ లేరు! గుడికి వెళ్ళిందిట!

ఆయన ఒక్కరే వున్నారు మంచం మీదకూర్చుని పేపరుచదువుకుంటున్నారు.

నన్ను చూడగానే 'రా!రా!' అంటూ ఆహ్వానించారు

ఎందుకోగానీ ఈరోజు ఆయన చాలా హుషారుగా వున్నారు.

నేను ఆయనకెదురుగావున్న కుర్చీలో కూర్చున్నాను.

ఇంతక్రితం వర్కర్స్ వచ్చి నన్ను నిలదీసిన విషయం ఆయనముందు ఎలా బైటపెట్టటమా అని మాటలకోసం వెతుక్కుంటుండగా ఆయనే అనేసారు.

"రవీ! ప్రెస్‌కిమంచి ఆఫర్‌వచ్చింది! అమ్మేస్తున్నాను!"

నారు ఎదురుగా పిడుగు పడ్డంత దిగ్భ్రాంతిగా చూసాను! ఆయన గుండెల మీదనుంచి పెద్దభారం దింపుకున్నంత తేలికగా మాట్లాడుతున్నారు.

"నా ఆరోగ్యం కుదుటపడేది ఒట్టిమాట ఒకవేళ కాస్తో కూస్తో లేచి తిరిగినా ఆ ఎగుడుదిగుళ్ళు, ఆ హైరాన నేను పడలేను. నేను బాగా ఆలోచించే యీ నిర్ణయానికి వచ్చాను. యీ ప్రెస్ అమ్మేస్తే వున్న అప్పు తీరిపోతుంది. నా ప్రాణం అటుయిటు అయినా ఆవిడకి డబ్బు విషయంలో నిశ్చింతగా వుంటుంది. దాదాపు పెటిల్ అయిపోయినట్టే రేపువస్తారువాళ్ళు!"

ఆయనబాధ, ఆవేదన నాకర్థమైనాయి.

అనారోగ్యంతో అలసిపోయిన మనిషి నిస్సహాయంగా బాధను బలవంతంగా తెచ్చుకునే వైరాగ్యం!

ఆయనకీ ఆ ప్రెస్‌కీ ఎంత అవినాభావ సంబంధం వుందో సుభద్రమ్మగారు అప్పుడప్పుడూ నాకు చెబుతూనేవుంటారు.

అయినా సరే! దానిమీద మమతల

వంకెళ్ళు ఛేదించుకుని, దాన్ని అమ్మటానికి సిద్ధం అయారు.

ఇందులో నాతో సలహా సంప్రదింపులు జరపలేదని నేనేం బాధ పడాల్సిన పనిలేదు. వాళ్ళకి మిగతా వర్కర్స్ అంతా ఎలాగో నేనూ అంతే! అందుకే ముందుగా సూచనప్రాయంగానైనా నా చెవిని వేయలేదు.

నేను ఈ విషయం విన్న తర్వాత అట్టేసేపు అక్కడ కూర్చోలేకపోయాను.

ఈ కొద్దికాలంలో యీ పత్రిక నాలో ఎన్నెన్ని ఆశలు రేపిందో, ఎన్ని వేల కలలని సృష్టించిందో ఆ భగవంతుడికే తెలుసు. నిరుద్యోగపు కల్లోల సముద్రంలో వద్దు! పగవాళ్ళకి కూడా యీ బాధవద్దు. ఆలోచన్లు తీరే అదృష్టం లేనప్పుడు అవి మొలకెత్తనే కూడదు.

సుదర్శనంగారి యింటినుంచి గోపాలం యింటికి వచ్చి ఎలా పడ్డానో నాకే తెలియదు. ఆ యింట్లోంచి బైటకి రావటం. బస్‌స్టాప్ దగ్గర నిలబడటం బస్ఎక్కటం దిగడం, యింటివరకూ నడిచి రావడం యివేవీ నాకు గుర్తు లేదు! శరీరం అలవాటయిన యీ పనులని యాంత్రికంగా చేసేసింది. నన్ను చూడగానే గోపాలం హడిలి పోయాడు.

దప్పున దగ్గరగా వస్తూ 'రవీ !ఏమిటి? ఏమైంది?' అన్నాడు ఆదుర్దాగా.

# యద్దనపూడి సులోచనారాణి

దిక్కుతెలియకుండా కొట్టుకు పోతున్న నాకు అప్రయత్నంగా దొరికిన యీ ఆధారం కేవలం దేవుడు యిచ్చిన వరమే నమకున్నాను.

దీని ద్వారా ఒక తీరం చేరుకున్న నేను, నా హృదయంలో పదిలంగా భద్రపరుచుకున్న ఆశల శిఖరాలని అధిగమించ గలననే అనుకున్నాను. నా ఆశలు దురాశలయినాయి. నా చేతికి అందినట్టే అంది నాలో యిన్ని కలలు సృష్టించిన యీ ఆధారం నన్ను వెక్కిరిస్తూ, ఒక్క తోపుతో మళ్ళీ నట్ట నడిసముద్రంలోకి త్రోసినట్టుగా వుంది మళ్ళీ వుద్యోగం కోసం అన్వేషణ!

మళ్ళీ నిరాశ! మళ్ళీ నిస్పృహ! ఓహ్! 'ఏముంది? భూమి గుండ్రముగా వుండును!' అక్కడున్న కుర్చీలో కూలబడుతూ నిస్పృత్తువుగా అన్నాను

'ఎమిటి నీ వుద్యోగం?' సందేహంగా చూసాడు

నేను క్లుప్తంగా జరిగింది చెప్పాను.

గోపాలం యింకేనా అర్థం కానట్టుగా చూసాడు

"పోతే పోనీ! దానికింత బాధఎందుకు? నేను మొదటే ఆ పత్రిక కుంటి గుర్రం పడకలా అప్పుటతో పడుతూ లేస్తూ నడుస్తోంది అంటే నువ్వు విన్నావూ? యిప్పుడైనా తెలిసింది! పోతే పోయిందిలే! యిది వరకు పరిస్థితులు వేరు. యిప్పుడు వేరు. నీకు వుద్యోగం దొరికే వరకూ నీ బాధ్యత

వాడి. సరేనా!" అ భుజం తడుతూ హామీ యిస్తున్నట్టుగా అన్నాడు.

నేను విస్మయంగా తలెత్తి గోపాలం వైపు చూసాను.

అతని కళ్ళు స్నేహపూర్వకంగా నవ్వాయి.

గోపాలం నన్ను పొరపాటుగా అర్థం చేసుకుంటున్నాడు అనిపించింది. కేవలం తిండికి బట్టకి యిబ్బంది పడిపోతానేమో నని బాధ కాదు నాది. వంటరివాడిని. ఏం తిన్నా ఎక్కడున్నా కాలం యిట్టే గడిచిపోతుంది. పూరి గుడిసెలో వున్న పూటకి గతిలేని దరిద్రుడికి, అగర్భ శ్రీమంతుడై బంగారు తూగుటుయ్యాలలో వూగుతున్న మనిషికి ఒకేరకంగా కాలం వెడుతుందీ నిజమే! కానీ ఆ అనుభవాల్లో వున్న వైవిధ్యం! అదెంత అపరూప మైనది?

నేను గోపాలం బలవంతం మీద ఆ రాత్రి అక్కడే పడుకున్నాను మంచం మీద కళ్ళు మూసుకుని పడుకున్నానన్న మాటేగానీ కంటి మీదకి కునుకు రాలేదు.

ఎలాగైనాసరే యీ ప్రెస్‌ని అమ్మ నివ్వకూడదు. కానీ ఎలా? యజమాను లైనవాళ్ళు. వాళ్ళకేదో అవసరం వచ్చింది అమ్ముకుంటున్నారు. మధ్యలో నేనెవర్ని కాదనటానికి? ఏ అధికారంతో వారిని నేను ఆపగలను! ఆలోచించి ఆలోచించి నా బుర్ర వేడెక్కటం మినహా నాకే వుపాయమూ తోచలేదు. చాలా బరువుగా బద్ధకంగా తెల్లవారింది.

మర్నాడు ఆఫీసుకు వెళ్లాను.

శర్మ, మూర్తి ఎవరూ రాలేదు

జవాబు వ్రాయాల్సిన వుత్తరాలు కొన్ని వున్నాయి.

వాటిమీద పెద్దగా ఆసక్తి లేకపోయినా కాలం గడపటం కోసం అవన్నీ తీసి వరసగా చూడసాగాను

12 గం॥ అవుతుండగా శర్మవచ్చాడు మూర్తి రాలేదుట కానీ అప్లికేషన్ తెచ్చి యిచ్చాడు. వాళ్ళిద్దరూ వేరే చోట ప్రయత్నాలు చేసుకుంటున్నట్టుగా చెప్పాడు. శర్మ వచ్చి వెళ్ళిన తర్వాత నాకు పని చేయబుద్ధి కాలేదు

మోచేతులు టేబుల్ మీద ఆనించి కుడి చేత్తో తల పట్టుకుని కూర్చున్నాను. మనసంతా ఒకరకమైన వైరాగ్యం! ఏం జీవితం అనే విసుగుదల! క్షణ క్షణం అడుగడుగునా జారి పడుతూ, లేస్తూ ఎన్నాళ్ళిలా బ్రతకటం! ఎంత కాలం అని చీకట్లో వెతుక్కులాడుతూ వెలుగు దొరుకుతుందని ధైర్యం తెచ్చుకోవటం! ఈ వెతుకులాటలోనే, యీ ఆశా నిరాశల మధ్య వూగిసలాడుతూనే జీవితం తెల్లారి పోతుంది కాబోలు

"రవీ!" వున్నట్టుండి వినిపించింది.

వులిక్కిపడి తలెత్తాను

ఎప్పుడొచ్చారో ఆవిడ అడుగుల చప్పుడు నేను గమనించనే లేదు. గదిలో నా ఎదురుగా సుభద్రమ్మగారు నిలబడి వున్నారు.

"మీరా!" కుర్చీలో నుంచి చప్పున లేచాను.

"కూర్చో. కూర్చో" నవ్వు తూ ఆవిడ నా ఎదురుగా నున్న కుర్చీలో కూర్చున్నారు.

"ఏమిటి? అలా వున్నావేం? ఒంట్లో బాగా లేదా!"

## జరిగిన కథ

అవాధశరణాలయంలో వచ్చిన పుద్యోగంలో యెంతో కాలం నిలువలేకపోయాను. ఇంటర్‌వ్యూకి వెళ్ళిన నాకు గోపాలంతో పరిచయమైంది. ఉన్నట్టుండి గోపాలానికి సుస్తీ చేయడంవల్ల అతని డ్యూటీ నేను చేపట్టి ఆ విధి నిర్వహణలో సమాజంచే దొంగగా ఊహింపబడ్డాను.

బాబాయి ఏదో సంబంధం ఉన్నదని ఆరువేలు కట్నం ఇస్తారనీ దాంతో తన బాకీ తీర్చవచ్చని ఉత్తరం రాశాడు. నేను ఆ సంబంధం చేసుకోను. నీ బాకీ తీర్చలేని అసమర్థుడనే అని ఉత్తరం రాశాను. గోపాలం ఆరోగ్యం కొంత కుదుట పడింది. గోపాలం బలవంతంమీద సినిమాహాలు గేటు కీపరుగా చేరటానికి ఒప్పుకున్నాను.

అక్కడ తలవని తలంపుగా పాత పరిచయస్థురాలు కాంతి తటస్థపడింది. సిగ్గుతో కుంచించుక పోయాను గతమంతా స్మృతి పథంలో తిరగడం మొదలైంది.

తరువాత 'జ్వాలాముఖి' పత్రిక నుండి ఇంటర్‌వ్యూ వచ్చింది. ఎడిటర్ ఆదరంతో ఆ ఉద్యోగం నాకే యిచ్చారు.

ఒకరోజున కాంతి నా కోసం గోపాలం ఇంటికి వచ్చి వాళ్ళ ఫ్యాక్టరీలో మేనేజరుగా చేరమని కోరింది. నాకు వేరే ఉద్యోగం దొరికింది మీ దగ్గర చేరలేను అని చెప్పాను. అలా అన్నందుకు గోపాలానికి నా మీద కోపం వచ్చింది. తరువాత గోపాలం ఆ ఉద్యోగంలో చేరాడు. 'జ్వాలాముఖి' సర్క్యులేషన్ పెంచాలనే ఉద్దేశ్యంతో 'ఇది మనదేశం' అన్న హెడ్డింగుతో ఒక శీర్షిక ప్రారంభించాము. —ఇక చదవండి.

"బాగానే వుంది." నవ్వు తెచ్చి పెట్టు కుంటూ అన్నాను.

"రవీ! నీకో ముఖ్యమైన విషయం చెబుదామని వచ్చాను" ఎంతో నెమ్మదిగా అన్నారావిడ.

ఆవిడ చెప్పబోయేదేమిటో నాకు తెలిసి పోయింది. సరిగ్గా నేను అనుకున్న మాటలే ఆవిడ నోటివెంట వచ్చాయి.

"రవీ! ప్రెస్ అమ్మటానికి నిశ్చ యించుకున్నారాయన.

నేను ఫైల్స్ చూస్తున్న నెపంతో క్రిందకి చూడసాగాను.

"బేరం కుదిరిందని తెలిసింది" నాకు తెలియకుండానే నా కంఠంలో కఠినత్వం కీర తొంగి చూచింది.

క్షణంసేపు ఆవిడ మాట్లాడలేదు.

ఏం చెప్పాలో నాకూ తోచలేదు.

కొద్దిసేపయ్యాక తర్వాత ఆవిడ నిట్టూర్పు విడిచారు.

తర్వాత అడిగారు

"రవీ! ఈ విషయంలో నిన్ను సలహా అడగటానికి వచ్చాను."

"నన్నా! సలహానా!" విచిత్రంగా చూసాను.

"అవును. ఈ ప్రెస్ అమ్మటం నా కిష్టంలేదు. సరిగ్గా ప్రసాద్ పుట్టిన రోజున యీ ప్రెస్ కొన్నాం. యిది, యిందులో పని చేస్తున్న వర్కర్స్. వాళ్ళ సాధక బాధకాలు నాలో ఒక భాగమైపోయాయి. ప్రసాద్ పోయిన తర్వాత యిదే నా జీవితం అయిపోయింది - యిది కూడా కాకపోతే—" ఆవిడ కంఠం వణికింది.

ప్రెస్ అమ్మడం యిష్టం లేదు!

ఈ మాట వినగానే నాలో ఆశ నాద స్వరం విన్న నాగుపాములా తలెత్తింది.

ఆవిడ చెప్పసాగింది.

"అనారోగ్యంతో ఆయన మతిపో యింది. యిక తను మామూలు మనిషి కాలేనని ఆయన నమ్మకం. తన కేదయినా అయితే, ఖర్చులకి నాచేతికి ఒక్క కాపీ దక్క నివ్వరని. తాను అన్నివిధాలా యిబ్బందిపడిపోతానని ఆయన భయం. వర్కర్స్ ఎవరికి నెల నెలా అనుకున్న సమయానికి జీతాలు యివ్వడం లేదని ఆయన బాధ."

"కానీ. వర్కర్స్ ఎవరినోటి నుండి ఎప్పుడూ తాను అసంతృప్తి విందినమాటలు వినలేదు."

"ఆ సంగతి నాకూ తెలుసు. వాళ్ళం దరినీ దాదాపు మా బిడ్డల్లా చూస్తున్నాం. ఆ కృతజ్ఞత వుంది వాళ్ళకి. ఆయన అనే దేమంటే ఈ రోజు కాకపోతె యింకా కొన్ని రోజులకైనా యిది మూసేయా ల్సిందే! దానికోసం వాళ్ళని ఎందుకు యిబ్బందిపెట్టాలి అని. వాళ్ళ కష్టానికి తగిన ప్రతిఫలం యివ్వలేనప్పుడు మనం వుంచుకోడం అనవసరం అంటారు. అది అన్యాయం అంటారు. నేను ఆయనకి నచ్చచెప్పలేకుండా వున్నాను రవీ!"

బాగుంది! యజమానులు జీతాలు సరిగ్గా యివ్వడం లేదనో, పెంచడం లేదనో సమ్మెలు చేసి, కేకలుపెట్టే వర్కర్సే నాకు తెలుసు!

యిక్కడ యిది పూర్తిగా వ్యతిరేకంగా వుంది.

"రవీ! నీతో ఒక విషయం చెప్పటానికి వచ్చాను! నేను ఎక్కడైనా ఒక పాతిక వేలు అప్పుతెచ్చి మాకున్న అప్పు తీర్చేసి, మిగతాది బాంక్‌లో వేసి, పత్రిక మీద డబ్బు వచ్చినా రాకపోయినా వర్కర్సుకి నెల నెలా జీతాలు అందేలా చేయాలని చూస్తున్నాను. దానిలో నీ సహాయం కావాలి నాకు."

"నేనా! మీరేది చెప్పినా చేయటానికి సిద్ధంగా వున్నాను." మనస్పూర్తిగా నిండు మనసుతో అన్నాను.

"నేను డబ్బు అప్పుగా తీసుకుంటానంటే సుదర్శనంగారు ఒప్పుకోరు. నీ కభ్యంతరం లేకపోతే ఆ అప్పు తీసుకోవడం, ఆ నోటు వ్రాయడం అంతా నీ పేరు మీద జరుగుతుంది. నీ కేమీ అభ్యంతరం లేకపోతే-"

"నా కభ్యంతరమా? యిందులో నాకేం కష్టం వుంది? ఎంతో ఆనందంగా చేస్తాను! అంతేగాదు. మీరు ఎక్కడో తెస్తున్న ఆ అప్పు సాధ్యమైనంత త్వరలో తీర్చటానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను." అన్నాను.

"కృతజ్ఞురాలిని రవీ! నేను నీ పేరు మీద ఎందుకని అంటున్నానో తెలుసా? నువ్వు యీ రకంగా మాకు సహాయం

౦నట్లుంటే. యికముందు ఎప్పుడూ సుద
సంగారు ప్రెస్ అమ్మతానని అనలేరు.
ఁ దీనిమీది వర్వాధికారాలూ పుంటాయి
డబ్బు నువ్వు యిచ్చి యిందులో
సస్వామిగా చేరుతున్నానని. యిది పీ
విల ఆవి సుదర్శనం గారికి చెబుతాను
రు పంగా అయితే ఆయన తప్పకుండా
ప్పుకుంటారు నువ్వు కావాలంటే ఆలో
చుకో. నేను సాయంత్రం వస్తాను"

"ఆలోచించటానికి యిందులో ఏం
ధకబాధలూ ఉన్నాయని! నాకు తప్ప
ండా అంగీకారమే!"

"అయితే నే నిప్పుడు యింటికి వెళ్ళ
నే ఈ విషయం ఆయనకి చెబుతాను."

"అలాగే!"

ఆవి ధలేస్తూ. నిట్టూర్పు విడుస్తూ
న్నారు.

"మా పెళ్ళి అయిన యిన్ని సంవత్స
౦లో ఆయన దగ్గర అబద్ధం ఆడటం
దే మొదటిసారి. యిది ఒకవిధంగా
ోచిస్తే ఆయనకోసం చేస్తున్న పనే!
ఁ అనారోగ్యంతో విసిగిపోయి యీ
ర్క్ బాధ చూడలేక. యీ అప్పు
ర్చడంకోసం అమ్మేస్తానని అన్నా
ాత చాలా బాధపడ్డారు. ప్రెస్‌మీద
౦టె కూడా ఆయనకి ఎక్కువ మన
రం."

నేను ఆవిడతో బైట వరకూ వచ్చి
గవంపాను.

ఆవిడని వంపి తిరిగి వస్తుంటే అర
౦ట క్రితం నా తల మీద కొండంత
రంగా వున్న బరువు హఠాత్తుగా దిగి
యినట్టయింది.

రాత్రినుంచి వస్తున్నవిరాళా,విన్నప్రహతో
పరీక్షించం చేస్తున్న నైరాశ్యం గాలికి చెల్లా
చెదురుగా ఎగిరిపోయింది.

ఒకసారి ఆ పరిసరాలన్నీ కలియ
చూసాను!

ఎందుకోగాని నా క్షణంలో యీ
పాత భవనానికి. నా జీవితానికి ఏదో అవి
నాభావ సంబంధం వున్నట్టుగా తోచింది.

మర్నాడు.

ఉదయం - నేను ఆఫీసుకి వెళ్ళిన అర
గంటకి ఫోన్ మోగింది.

రిసీవర్ తీసాను!

సుభద్రమ్మగారు మాట్లాడారు.

"రవీ! డబ్బు దొరికింది! మధ్యా
హ్నము కాగితాలు పంపిస్తాను సంతకం
పెట్టి పంపించు."

"అలాగే. థాంక్ గాడ్! నేనింత
త్వరగా దొరకదేమోనని భయపడ్డాను.
ఎవరిచ్చారు?"

"నాకు దూరం చుట్టాలు. మధ్యా
హ్నం నోటు తీసుకుని నేనే వస్తాను.
వుంటాను" ఎవరో వచ్చినట్టున్నారు.
ఆవిడ జవాబు కోసం ఆగకుండానే
ఫోన్ పెట్టేసింది.

మధ్యాహ్నం ఆవిడ వచ్చారు.

నోటుమీద సంతకం పెడుతూంటే
నాకు తమాషాగా అనిపించింది. నా
ముక్కు మొహం తెలియని ఆ వ్యక్తి
ఎవరో నాకు పాతికవేలు యిస్తున్నారు!
యిందులో ఒక్క పైసాకూడా తీసుకోని
నేను పాతికవేలకి అతనికి బుణపడు
తున్నాను!

ఆవిడ నోటు తీసుకుని వెళ్లారు.

ఈ విషయం మా యిద్దరి మధ్యే వుండేట్టు నిర్ణయం చేసుకున్నాం. రెండు రోజుల అనంతరం సుభద్రమ్మ గారు డ్రైవర్‌కి చీటీ వ్రాసి యిచ్చి పంపారు. అందులో డబ్బు అప్పు యిచ్చినవాళ్ళు సాయంత్రం టీకి వస్తున్నారని, వాళ్ళని పరిచయం చేస్తానని నన్ను కూడా రమ్మనమని కోరుతూ వుంది. అలాగే వస్తానని కబురు చేసాను.

సాయంత్రం అయింది.

'జ్వాలా ముఖి' దసరా పండగ ప్రత్యేకసంచికగా. సర్వాంగసుందరంగా తీర్చిదిద్దాలని ప్రయత్నిస్తున్న నేను అసందర్భంలో ప్రచురించటానికి వ్యాసాలు ఎన్నిక చేస్తున్నాను. ఆ పనిలో మునిగి పోయిన నేను సాయంత్రం 6 గం||కి సుభద్రమ్మగారింటికి వస్తానని చెప్పిన మాటే మర్చిపోయాను.



6 గం|| అవుతుండగా ఫోన్ మోగింది.

యథాలాపంగా రిసీవర్ తీసాను.

'హలో!' అవతల నుంచి మృదుమధురంగా వున్న స్వరం వినిపించింది.

'యస్!' అన్నాను

'రవీంద్రగారేనా?'

'అవును.''

'నేను సత్యాని మాట్లాడుతున్నాను.

'సత్యా!' నాలో నేను అనుకున్నట్లుగా అన్నాను.

క్షణంసేపు నా చేతులో కాగితాలు నేను చేస్తున్న పని అన్నీ సర్వస్వం మరిచి ఆ కంఠ ధ్వని వినాలనే కోరిక కలిగింది.

ఆంటీ మీకోసం ఎదురు చూస్తున్నారు. వాళ్ళు టీకి వచ్చారు. నా కళ్ళు ఎదురుగా వున్న గోడ గడియారం వైపు తిరిగాయి. టైము 7 గం. కావస్తోంది.

''ఓ! సారీ! నేను యిప్పుడే వస్తున్నాను. పది నిముషాల్లో అక్కడుంటాను.''

''సరి. ఆంటీకి చెబుతాను.'' ఆ అమ్మాయి పెట్టేసింది.

గబగబ కాగితాలు సర్దేసాను. నా చెవిలో యింకా సత్య మాట్లాడుతున్నట్టే వుంది.

అర గంటలో సుభద్రమ్మగారి ఇంటి

ముందు వున్నాను. అవిడే ముందుగా ఎదురు వచ్చారు నాకు.

"రా! యింత ఆలస్యం చేసావేం?" వాళ్ళువచ్చి చాలా సేపయింది.

"క్షమించాలి." లోపల అడుగు పెడు తున్న నేను గదిలో పెనుభూతం చూసినవాడిలా ఆగిపోయాను.

గదిలో సోఫాలో పక్క పక్కగా శాంతి, శాంతి భర్త కూర్చున్నారు! నా కళ్ళు తిరిగినంత పనైంది? నా ఆనందం. ఆత్రుత ఒక్కసారి గాలి కెగిరిపోయింది.

నోటమాట రానివాడిలా విశ్చేష్టుడై నట్టు వాళ్ళని చూడసాగాను! సత్య చిరునవ్వుతో పరిచయం చేసింది.

"రండి. ఇదుగో మా పిన్తల్లి కూతురు. నాకు అక్క అవుతుంది శాంతి. యీయన మా బావగారు కళ్యాణ సుందరంగారు. అందరూ సుందరం అంటారు."

నన్ను నేను సంబాళించుకోటానికి రెండు నిముషాలు పట్టింది.

అయినా యింకా తొట్రుపాటు తగ్గ లేదు.

శాంతికి నేను ముందే తెలుసు కాబోలు! కాలు మీద కాలు వేసుకుని చిరు నవ్వుతో. ధీమాగా చూస్తూ కూర్చుంది.

ఆయన కరచాలనం కోసం అన్నట్టు చేయిజాచాడు!

నేను ఆ చేయి అందుకోలేదు!

రెండు చేతులూ జోడించి నమస్క రించాను.

"ఇతనా! ఇతను నాకు తెలుసు సత్యా? ఇందరులో మా యింట్లో వుండి చదువు కునేవాడు!" అంది శాంతి.

ఆయనేం మాట్లాడలేదు. ఎదురుగా టీపాయి మీద చిన్న పళ్ళెంలో పెట్టి వున్న ఒక్కపొడి చేతిలోకి తీసుకుని దాన్ని పరీక్షచేస్తూ ఒక్కొక్క పలుకే నోట్లో వేసుకోసాగాడు.

"కూర్చో" అంది శాంతి.

అలాగే నిలబడిపోయిన నేను అప్పుడే స్పృహ వచ్చిన వాడిలా అక్కడున్న కుర్చీలో కూర్చున్నాను.

శాంతి నీడ కూడా పడటానికి వహించని నేను శాంతి దగ్గర పాతిక వేలు అప్పు తీసుకున్నట్టు నోటు వ్రాసి యిచ్చాను! నన్ను నేను తాకట్టు పెట్టు కున్నాను?

సుభద్రమ్మగారు లోపలికి వెళ్ళి నాకు టిఫిన్ తెచ్చారు.

కూర్చున్న కొద్దిసేపూ శాంతి,సుభద్రమ్మ గారు వాళ్ళిద్దరే ఎక్కువగా మాట్లాడారు. సుదర్శనంగారికి యివ్వాళ బాగా టెంప రేచర్ రావడంతో ఆయన పడుకుని వున్నారు.

శాంతి. కళ్యాణ సుందరం యిద్దరూ వెళ్ళటానికి లేచారు.

"ఎలాగూ తెలిసినవాళ్ళవే? ఈ రూపంగా యింకా దగ్గరగా ఆయాం. అప్పు డప్పుడూమా యింటికి వస్తూండు." అంది శాంతి.

నేను అవుననలేదు. కాదనలేదు.

శాంతి. భర్త వెళ్ళిపోయారు.

శాంతి. వెళ్ళిపోయే ముందు నావైపు విసిరిన చూపులోని విజయగర్వం నా అభి మానాన్ని నిర్దయగా. వాడిగా కాటు వేసింది!

నాకు తల తిరిగి పోతున్నట్టుగావుంది.

ప్రొద్దుట నుండీ నేను పొందుతున్న శిశ్చింత. ఆనందం ఏర్పరుచుకున్న ఆశలు వాటియొక్క పునాదులు కదిలి పోతున్నట్టుగా కనిపించినాయి.

వరండాలో పరధ్యానంగా నిలబడిన నా దగ్గరకి సత్య వచ్చింది.

ఎల్లుండి సాయంత్రం మీకు ఖాళీగా వుంటుందా?"

"ఆ; ఏం?" అ అమ్మాయివైపు తిరుగుతూ అడిగాను.

"మా కాలేజీడే జరుగుతోంది. మీకు వీలుంటే రండి." అంది.

ఇన్విటేషన్ యిస్తూ.

"తప్పకుండా వస్తాను." వాగ్దానం చేస్తున్నట్టుగా అన్నాను.

"వూరికే కాదు కెమెరాతో రావాలి. మేం అనార్కలీ డ్రామా వేస్తున్నాం."

"అలాగే."

శాంతి మాటలతో ఏర్పడిన మాలిన్యం ఏదో సత్య అమాయకమైన కళ్ళలో కడిగేసుకుంటున్నట్టు అనుభూతి పొందాను నేను.

మూడో రోజున సత్య కాలేజీ డే ప్రోగ్రాంకి సీత, గోపాలం పిల్లలనికూడా నా వెంట తీసుకుని వెళ్ళాను.

ప్రోగ్రాంకి సుభద్రమ్మగారు, భాస్కరంకూడా వచ్చారు

శాంతి, భర్తవచ్చారు.

గోపాలం, శాంతి. శాంతి భర్త, భాస్కరం అందరూ ఒకే వరసలో కూర్చున్నారు.

నేను సత్య ఆహ్వానంపై స్టేజీవెనక్కి వెళ్ళాను.

అనార్కలీ నాటకంలో అంతా ఆడవారే పాల్గొన్నారు.

సత్య అనార్కలీ వేసింది.

నిజంగా మగవాణ్ణి సుమా అనే భ్రమ కల్పించేటంత పొడుగు. లీవిగా వున్న ఒకమ్మాయి సలీమ్‌వేసింది.

నాటకం గొప్పగాలేకపోయినా మరీ నిరుత్సాహంగా మాత్రంలేదు. నేను నాటకం జరుగుతుండగా వాలుగ్గైదుసార్లు ఫోటోలుతీసుకున్నాను. నా పేహితుడైన గోపాలం శాంతి వాళ్ళ కంపెనీలో పని చేస్తున్నాడని తెలిసి సుభద్రమ్మగారుఎంతో సంతోషించారు.

దసరా సంచిక ముద్రణ ప్రారంభమైంది.

నేను చాలా హడావుడిగా. క్షణం తీరుబడి లేనట్టుగా వున్నాను

అనార్కలీ నాటకం ఫోటోలు ఆరోజే వచ్చినాయి.

సత్యని మంచి కోణాల్లో రెండు మూడు విడిగా తీసాను

సత్య కళ్ళల్లో ఏదో విషాదం వుంది; మూగవేదనని విశ్వదంగ భరిస్తున్న అమాయకత్వం ఆ కళ్ళలో తొంగిచూస్తూ వుంటుంది; నాకు తెలిసినంతవరకూ ఆ అమ్మాయికి అంత విపరీతమైన బాధలేవీ లేవు మరి.

ఫోటోలు దాదాపు అన్నీ బాగానే వచ్చినాయి. సుభద్రమ్మగారికి ఫోన్‌చేసి సత్యకి చెప్పమని చెప్పాను. కవరులో పెట్టి డ్రాయరులో వుంచాను. సత్యకి ముఖాముఖీ యిచ్చి స్వయంగా అభినందనలు తెలపాలి; అది ఎన్ని రోజులు పట్టినా సరే; అనుకున్నాను.

ఆ నెల దసరా సంచికకి ఎడిటోరియల్

వ్రాస్తున్నాను. నా యీ సంపాదకీయం చాలా బాగా రావాలనే కాంక్షతో వున్న నేను చుట్టూవున్న పరిసరాలు మర్చి. పూర్తి ఏకాగ్రతతో దానిలో లీనమైపోయి వేట్లగా వ్రాస్తున్నాను.

ఇంతలో నా గది బైట అడుగుల చప్పుళ్ళు. ఎవరో చాలామంది వస్తున్నట్టు కలకలం వినిపించింది.

నేను వ్రాస్తున్న వాక్యం పూర్తి చేసి తలెత్తేలోపలే, చిందులాడుతూ. ఏడు ఎని మండుగురు అమ్మాయిలు ఒకరిని ఒకరు తోసుకుంటున్నట్టు లోపలికు వచ్చారు. నేను పెన్ టేబిల్‌మీద పెట్టేసాను

అందరి వెనకా. ఆఖరిన సత్యవతి లోపలికు వచ్చింది.

నా కర్థమైంది! ఈ బృందం అంతా అవార్కలీ నాటకం గుంపు! అందరూ గుంద్రంగా నా టేబిల్ చుట్టూ వచ్చి నిల బడ్డారు.

"మా ఫొటోలు బాగా వచ్చినాయ టగా? ఏవి?" సలీమ్ వేసిన అమ్మాయి అడిగింది.

"కూర్చోండి." వాళ్ళందరికీ నా ఎదు రుగా వున్న కుర్చీలు చూపించాను. అక్క డున్నవి నాలుగే కుర్చీలు!

వాళ్ళున్నది ఎనిమిదిమంది!

ఆ కుర్చీలు చూసి, ముఖాలు చూసు కుని అవసరం లేదన్నట్టు నిలబడ్డారు,

అందరూ అలా నిలబడటంతో సత్య నా కెదురైవున్న కుర్చీ దగ్గరగా వచ్చింది అంత దగ్గరగా ఆ అమ్మాయిని చూడ గానే నా గుండెలు ఒక్కక్షణం వేగంగా కొట్టుకున్నాయి.

డ్రాయరు సొరుగు లాగి ఫొటోలున్న కవరు బైటకి తీసి ఒక్కొక్కటీ నా ఎదురుగా వున్న టేబిల్ మీద పరిచాను.

"ఏవీ? ఏవి! అంటూ అందరూ వంగి ఒకేసారిగా చూడసాగారు. అట్టడుగున వున్న సత్య ఫొటో మాత్రం బైటకి తీయలేదు.

"అన్నీ చాలా బాగా వచ్చినాయి. ఎడి టర్‌గారికి గ్రాండ్‌గా పార్టీ యిద్దామే రేణూ" అంది సలీమ్ వేసిన అమ్మాయి.

"ఓ తప్పకుండా! యింక ఎప్పుడు ఏ ఫంక్షన్ అయినా మనం యీయన్నే పిలుద్దాం." అంది యింకో అమ్మాయి.

"మీకు అంత బాగా నచ్చితే నాకు పార్టీ వద్దు. యింకోటి అడుగుతాను యివ్వండి." అన్నాను.

"ఏవిటది చెప్పండి!" అంది ఆ అమ్మాయి.

అందరూ కుతూహలంగా చూసారు.

"మీరంతా మా జ్వాలాముఖికి ఒక్కొక్క సంవత్సరం చందా కట్టండి." నవ్వుతూ అన్నాను.

అందరూ ఒక్కసారి ఫక్కుమని నవ్వారు.

"ఖలేవారే మీరు. సరి! నా చందా తీసుకోండి." అంది సలీమ్ బాగ్ తెరుస్తూ.

"నాది కూడా."

"యిదిగో నాది."

టేబిల్ మీద గబ గబా డబ్బులు పడ్డాయి.

నేను అన్నీ లెక్క పెట్టుకుని వాళ్ళకి రశీదులు వ్రాసి యిచ్చాను.

"సత్యా! మేం అయితే చందా కట్టాం. మరి నువ్వో!" అంది ఒక అమ్మాయి.

"అసలందరిలోకీ సత్యఫొటోలే బాగా వచ్చినాయి." యింకో అమ్మాయి కంప్లయింట్ చేసింది.

"నా కెమెరాకి అలాటి పక్షపాతాలు ఏమీ లేవు బాబూ! వున్నది వున్నట్టుగా చూపించింది." అన్నాను.

అందరూ మళ్ళీ ఒక్కసారి నవ్వారు.

నేను అన్నదాంట్లో పెద్ద జోక్ ఏం లేదు.

అయినా వాళ్ళ వయసు అలాటిది!

చీకూచింత లేకుండా కిల కిలలాడుతూ ఆకాశంలో పక్షుల్లా హాయిగా జీవితం గడిపే ఆ విద్యార్థి దశే అటువంటిది.

"ఎడిటర్‌గారూ! మేం ఒప్పుకోం. సత్య దగ్గర కూడా మీరు ఏదయినా వసూలు చేయాల్సిందే!" ఒకమ్మాయి పేచీ పెడుతున్నట్లుగా అంది.

నేను సత్యవైపు చూసాను.

నవ్వుతూ అన్నాను.

"వసూలు చేయండే నేనూ వూరుకోను. నా కెమెరాకే కాదు. నాక్కూడా పక్షపాతం లేదు. సత్య! నా తోపాటు వాళ్ళందరికీ కూడా నువ్వు ఎప్పుడైనా మీ యింటికి పిలిచి మంచికాఫీ ఇవ్వాలి."

"వెరీ గుడ్. రైట్." అంది ఒకమ్మాయి.

సత్య అలాగే అన్నట్టు తలవూపింది.

"రండే! పోదాం. చాలా ఆలస్యం అయింది." సలీమ్ దారితీసింది.

అందరూ అనుసరించారు.

అందరి వెనక ఆఖరిగా సత్య వెళ్ళింది.

సత్య వెళ్ళేముందు వెనక్కి తిరిగి మళ్ళీ నావైపు చూస్తుందేమోనని ఆశించాను. కానీ సత్య వెనక్కి తిరగలేదు. ఆ అమ్మాయి వెనక్కి తిరిగి చూపినట్లయితే బహూశా వ్రాస్తూ అప్పుచేసిన ఆ సంపాదకీయం నేను పూర్తి చేయలేక పోయేవాడినేమో!

సత్య! మళ్ళీ అదే అనిపించింది. మెత్తగా, అణకువగా వున్న యీ అమ్మాయికి సత్య తగిన పేరు కాదు!

యింకేదయినా అయితే బాగుండేది.

(సశేషం)



# శివా-పులి

శ్రీనాపోవి



కలియుగే. ప్రథమపాదే. జంబూ ద్వీపే. భరతవర్షే. భరతఖండే, అస్మిన్ వర్తమానేన వ్యావహారిక చాంద్రమానేన .. సంవత్సరాణాం.

నాలుగు వేదాలూ నమిలేసిన ఆ అగ్రహారం ఒక కొండవార నీడలో ఉంది. అక్కడ అన్ని కులాలవాళ్ళూ తమ కుల వృత్తులు చేసుకుంటూ, ధర్మాన్ని పెంపొందిస్తూ, అధర్మాన్ని అసహ్యించుకుంటూ, చల్లగా, హాయిగా జీవిస్తున్నారు. ఏడాదికి మూడు కుంచాలవర్షం. పదహారణాలంటా వారికి మామూలు అయిపోయేయి. కలి కాలం అయినా వారు ధర్మాన్ని పిలక పట్టు కొని నాలుగు కాళ్ళమీదా నడిపిస్తున్నారు.

ఇది ఇలా ఉండగా ఆ ఊరు ఒకస్వామి వచ్చేరు. వారు వేదాల్నీ, వేదాంగాల్నీ ఏనాడో నమిలేసేరు. సకల శాస్త్రాలనీ పిడిచి తాగేసేరు. వారు చూపులకి బంగారం పిసికి చేసినట్టు ఉంటారు. ఇన్ని ఉన్నా, వారికి 'నాది' అని చెప్పుకోడానికి కౌపీనం మినహా ఇంకేమీలేదు.

వేదవేదాంగాలు చదివినవారికికూడా ఆకలివేస్తుంది. స్వామి పాలు మినహా ఇంకేమీ పుచ్చుకోరు. అంచేత ఒకవైశ్య శిఖామణి వారికి దూడతోసహా ఒక ఆవుని దానంచేశాడు.

ఆవు నల్లగా ఉంటుంది. దూడకూడా నల్లగానే ఉంటుంది. ఆవుకి ఎక్కడా మచ్చలేదు. దూడకి కూడాలేదు. దూడ నెమ్మదైంది. ఆవు యింకా నెమ్మదైంది. దాన్ని ఎంచేతో 'కామధేనువు' అని పిలవకుండా 'గంగిగోవు' అని పిలిచేవారు ప్రజ. అది ఏ పొలంలో మేసినా ఎవరూ అడ్డుపెట్టరు. అయినా అది తన పేరు సార్థకం చేసుకోవడానికే అన్నట్టు ఎవరి పొలంలోనూ మేయక. 'దొంగపాలు' యజమానికి యివ్వడం యిష్టం లేక. అది కొండవార పచ్చికలో మేసేది. కొండదిగువ ఏట్లో నీళ్ళుతాగేది. గడ్డి. నీళ్ళూ కలిపి చిక్కటి పాలు యిచ్చేది.

మంచికాలం యిలా కొంత గడిచేక ఆవేళ మధ్యాహ్నం ఝామున్నరైంది.

గంగిగోవు మేస్తున్న పీటిలోపచ్చిక భూమ్మీద పరుచుకున్న మేఘంలా ఉంది. దానిమీద పడిన కొండనీడ - ఏటి నీడలా - చల్లగా ఉంది. దూరంనుండి చూస్తే పచ్చికలో మేస్తున్న గంగిగోవు - వెన్నకంపెనీ ఎడ్వర్టైజ్‌మెంట్ బొమ్మ ఆవులా అందంగా. ఆరోగ్యంగా ఉంది.

అంతలో గంగిగోవు తలఎత్తి చూసింది. కొండనీడ చింతతోపు చివరకి వచ్చేసింది. అంటే "అమ్మ నాటోయ్! ఆశ్రమానికి వెళ్ళిపోవలసిన కాలం వచ్చేసిందన్నమాట. గంగిగోవుకి యింకా ఆకలి తీరలేదు. అయినా అది దొంగగొడ్డు కాదుకాబట్టి ఇంటికి వెళ్ళడానికి వాగువేపు పరిగెత్తింది.

వాగు నీటిలో కొండరంగు కరిగినట్టు నీరు నీలిగా ఉంది. కొండమీది ఓషధుల సారం అంతా గ్రహించినట్టు ఆ నీరు చాలా చల్లగానూ. ఉత్తేజకరంగానూ ఉంది.

గంగిగోవు నాలుగు గుక్కలు నీరు తాగిందో లేదో, దానికి వాగు గట్టుమీదినుండి ఒక భయంకరమైన అరుపు వినిపించింది. ఆ అరుపుకి నీరు గడ్డకట్టి పోయింది. అప్పుడు గంగిగోవు చూలుతో ఉండి వుంటే దాని కడుపులో పిల్లచచ్చిపోయేది.

గంగిగోవు తలఎత్తేసరికి దానికి దగ్గర్లోనే ఒక నల్లరాతిమీద ఒకవింతజంతువు నిలబడిఉంది. అది రాజుగార్లా దర్జాగా ఉండటమే కాకుండా. అప్పుడే నిద్రలేచిన రాజుగారిలా బద్ధకంగాకూడా ఉంది.

గంగిగోవు అమాయకంగా ఆజంతువు వేపు చూసింది.

"నేను పులిని" అంది ఆ జంతువు.

"మిమ్మల్నికలుసుకున్న నేను అదృష్టవంతురాల్ని" అంది ఆవు.

"నాకాఁకలేఁస్తోంది" అందిపులి.

"పాలివ్వేదా!" అంది అమాయకంగా ఆవు.

"మేం పులిపాలు తప్ప తాగం" అధికారంగా ప్రకటించింది పులి.

"ఇక్కడ గడ్డి చాలా రుచిగా వుంటుంది."

"గడ్డి గోవులు తింటాయి" విరసనగా నవ్వింది పులి.

"మరిమీరు....

"గోవుల్ని తింటాం. మీకూ. మాకూ పరస్పర విరోధం. కావలిస్తే పంచాంగం చూసుకో".

ఆవుకి మాటరాలేదు. పులిచూస్తే అది అబద్ధమాడేరకంలాలేదు.

"నామాట అబద్ధమేమో చూడు. నిన్ను మెల్లిగా పంజాతో ఒక దెబ్బ కొడతాను. ఆ తర్వాత పూర్తిదెబ్బ తట్టుకోగలవేమోచూడు" అని అరసెకండు ఆగకుండా గంగిగోవు తలమీద పావు బలంతో ఒక దెబ్బకొట్టింది పులి.

ఆవుకి యినపరాయితో తలమీద ఎవరో రాక్షసుడు కొట్టినట్టు అయింది. తల పగిలిపోయినట్టు రక్తం చిమ్మింది. కళ్ళల్లో రక్తంపడి ఎదురుగా ఉన్నపులి రక్తంలో స్నానంచేసిన దానిలా భయంకరంగా కనిపించింది.

"నువ్వు నల్లదానివి. అంటే మంచిదానివి. తెలివైనదానివి అన్నమాట. నేను నిన్ను అరక్షణంలో చంపగలనని యీ పాటికి గ్రహించే వుంటావు. ఇంతమంచిదానివి నిన్ను ఎక్కువ బాధపెట్టి చంపదలుచుకోలేదు. నువ్వు పెనుగులాడకుండా ఉంటే మూణ్ణిమిషాల్లో పనిపూర్తిచేస్తాను" అందిపులి పనిలోకి దిగడానికి సిద్ధపడుతూ.

ఆవు పవిత్రమైన ఆశ్రమ వాతావరణంలో పెరిగింది చావుఅంటే యీ ఐహిక బంధాలనుండి ఆత్మవిముక్తి పొందడం అని ఏనాడో గ్రహించిన దవదంవల్ల. పులి అన్నమాటకు బెదరలేదు. కాని దానిమనసు ఒక్కసారి ముడిపడినట్టు బాధపడింది తనపిల్లని తల్చుకోగానే.

అంచేత "ఓ పులి పుంగవా! నేను గోవుని. అంటే జీవరాసుల్లో పవిత్రమైన దాన్ని. నీ ఆకలి తీర్చేఅవకాశం ఇచ్చిన నీకు ఎలా ధన్యవాదాలు చెప్పుకోవాలో తెలియడంలేదు. నువ్వుకొట్టిన చావు దెబ్బతో బతకడం చావుకన్న దుర్భరంగా ఉంది. కాని ఒక్కమనవి. ఇప్పుడు నీ అంత ఆకలితోనూ నాబిడ్డ ఆశ్రమంలో కిరకిరలాడుతూ ఉంటుంది. కాబట్టి నాకు వ్యవధియిస్తే దాని ఆకలి తీర్చి క్షణంలో వచ్చేస్తా. అప్పుడు నువ్వు కొమ్ములతో సహా తినెయ్యి అంది.

పులి ఆలోచిస్తూ కళ్ళుమూసుకుంది.

"నీకు దూడవుందని నేను నమ్మను" అంది కళ్ళుతెరవకుండా.

"నాయీదేసిన పొదుగు చూడు" తనన్నమాట నిజమన్న నమ్మకంతో అంది గంగిగోవు.

"చేటపెయ్యలకి చేపే జాతిపిది" అంది ఎగతాళిగా పులి.

ఆవు అంతరాత్మ. ఆత్మాభిమానం దెబ్బతిన్నాయి. "నా దూడని నాతోకూడా తెస్తే అది బతికేఉందని నమ్ముతావా?" అంది ఆవు రోషంగా నోట్లోకి కారిన రక్తాన్ని తక్కుతూ.

"అలా అయితే నమ్ముతా. కానివేగం వచ్చెయ్"అనుమతించిందిపులి.

• • •

తర్వాత హంగాలు చకచకా జరిగి పోయేయి.

బాధతోనూ. ఆతృతతోనూ గంగి గోవు ఆశ్రమానికి పరిగెత్తింది. తన దూడకి ఆఖరిసారి తనివితీరా పాలుఇచ్చు కొంది. పాలిస్తున్నప్పుడు దాని రక్తం దూడమీద కూడా పడింది.

ఆ తర్వాత గంగిగోవు పిల్లతోసహా హాజరైంది పులిదగ్గర

"నీ నిజాయితీకి నేను మెచ్చేను" అని పులిదాన్ని అభినందించింది.

తర్వాత - ముందుదూడనీ. తర్వాత ఆవునీ తినేసింది. •

# అజ్ఞాత అందం




కల్యాణి ఈ కథకు నాయిక.

ఐతే కళ్యాణిగురించి చెప్పేముందు తాతయ్య విషయం ఇక్కడ వివరంగా చెప్పటం ఎంతో అవసరం. తాతయ్య పుట్టింది పురాతనయుగంలోనైనా ఆధునిక భావాలకు అలవడ్డే. మారిన కాలంతోపాటు మన తత్వాలు మారాలనే మాటకారి ఆదర్శవాదికాకుండా మారిన మన తత్వం గల అసలైన ఆదర్శవాది మాత్రా చాలాను. మనిపట్టిన పాతకాలాలను

కొద్దిగా నమ్మినా అవసరమొస్తే ఆవల నెట్టటానికి వెనుదీయని స్వభావి. తాతయ్య వద్ద నాకు చిన్నతనంనుండి కొద్దంత చనువుంది. ఆయన నన్ను స్నేహితుడిలా చూస్తారు.

పోతే కళ్యాణి విషయం - ఒకే మాటలో చాలా మంచిది. కాని ఈ ముక్కే మీరు తాతయ్యతో అంటే ఇంతెత్తుకస్సుమని లేచి రామూగాడ్ని లేపుకుపోదామని ప్రయత్నించిన వన్నెలాడి (బి.ఎ కూడానూ) అని అంటాడు. అని ఊరుకోడు. పెద్దింటికుఱ్ఱాడిపై కన్నేసింది కాబట్టే అదస్రు లేకుండా పరారైంది. ఏమైనా ఒకటిమాత్రం నిజం మా రాము అదృష్టవంతుడు. ఓ విషవలయంనుంచి విముక్తుడయ్యాడు' అని కూడా అంటాడు. వెంటనే ఏపనిచేస్తున్నా తన పొన్నుకర్రతీసుకుని గబగబా బయటకు వెళ్ళిపోతాడు.

• • •

మనం కోరుకున్నరీతిలో మనస్సుకు నచ్చినవిధంగా ఓ శిల్పం చెక్కబడిఉంటే ఆ శిల్పసౌందర్యం చూసి సంతృప్తి చెందలేం. ఆరాధించి పూజిస్తాం. అందుబాటులో ఉంటే ఆశిల్పానికి ప్రాణంపోసి ఆ సౌందర్యాన్ని కైవసం చేసుకుంటాం. కళ్యాణి విషయంలోకూడా అంతే జరిగింది.

విశాఖపట్నం ప్లీడరీ చదువుకు వెళ్ళిన కొత్తలో ఇంటివైపు పదే పదే వెళ్ళే ధ్యాసను మరోవైపు మళ్ళించే నెపంలో రోజూ బీచికు వెళ్ళటం. అక్కడ ఓ రెండు మూడు గంటలు గడపటం అలవాటు చేసుకున్నాను. నాలాగే నేను కూర్చొన్న చోటుకు ఓ పది గజాల దూరంలో రోజూ ఓ యువతి కూర్చొనేది. తను కట్టుకున్న తెల్లచీర కుచ్చెళ్ళ అంచులు చిరుకెరటాల తాకిడిచే తడుస్తూంటే లక్ష్యపెట్టకుండా తీర్చిదిద్దిన అజంతా సుందరిలా సముద్రాన్ని తదేకంగా చూస్తూండేది. ఆపరిసర ప్రకృతిలో ఆమె కూడా ఓ భాగమై పోయింది. ఆమె అజంతా అందం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. చిరునవ్వులతో ప్రారంభమైన మా స్నేహలత క్రమంగా విరగబడి ఏపుగా పెరిగింది. మేం భవిష్యత్తులో విడిపోయి బ్రతకలేనంత దగ్గరితనం నేర్పరిచింది. అందుకే కళ్యాణిని నేను వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాను.

• • •

"ఆ అమ్మాయి పేరు?"

"కళ్యాణి."

"ఎంత కాలం నుంచీ పరిచయం?"

"రెండేళ్ళ నుంచి. బీచ్‌లో పరిచయమైంది. చాలా కాలం నుంచీ మీకు చెప్పాలని అనుకుంటూనే ఉన్నాను. క్రిందటి సారి వచ్చినపుడు ఇక్కడికి తీసుకొచ్చి పరిచయం చేద్దామనుకున్నాను."

తాతయ్య ప్రాణస్నేహితుడైన రాఘవరావుగారు విశాఖ వచ్చినపుడు బీచిలో నన్నూ కళ్యాణినీ జంటగా చూటంతో సెలవలకు రాంగానే తాతయ్య నిలదీసాడు.

"ఉట్టి స్నేహమేనా – ఇంకేమైనా ఉందా?"

"ప్రస్తుతానికి ఉత్త స్నేహమే. ఇకపైన మీ అనుమతితో ఆమెను వివాహం చేసుకోవాలనుకుంటున్నాను."




"ఊఁ చాలా వరకు వచ్చింది: ఎప్పుడూ చెప్పలేదేం?"

"అవసరం రాలేదు కాబట్టి చెప్పలేదు. ఇప్పుడు సమయం వచ్చింది కాబట్టి చెపుతున్నాను."

"ఆ అమ్మాయికి తల్లిదండ్రులున్నారా?"

"తల్లి ఉంది. తండ్రి సంగతి తెలియదు."

"అంటే?"

"కళ్యాణి అమ్మగారు పెళ్ళికాకముందే గర్భవతయ్యారు. పెళ్ళి చేసుకుంటానన్న ఆ ప్రబుద్ధుడు ఆమెను మోసం చేసి ఎక్కడికో వెళ్ళిపోయాడు, ఆవిడమాత్రం అతని పేరును వెల్లడించటానికి నిరాకరించింది."

"సరే. కళ్యాణి ఫొటో నీ దగ్గరుందా?"

"ఉంది."

"ఓసారి ఇవ్వు."

ఇచ్చాను. ఓ క్షణం చూసి జేబులో పెట్టుకుని గంభీరంగా అన్నాడు తాతయ్య.

"నీ సహనానికి హద్దు ఎన్ని మైళ్ళో నీకు తెల్సా? నీ హృదయ వైశాల్యం ఎన్ని చదరపు కిలోమీటర్లో అంచనా వేయగలవా?"

అవహేళనో, హాస్యమో తెలియని ఆ ప్రశ్నలకు జవాబు ఏం చెప్పాలో తెలియలేదు.

"పోనీ, ఈ ప్రశ్నలకు జవాబు చెప్పు. నీ పెళ్ళాం ఓ పతిత గారాలపట్టి అని పది మందీ నిన్ను వేలెత్తిచూపించి అనుక్షణం చిత్రవధ చేస్తుంటే సహించే ఓపిక నీకుందా? సంఘం - సమాజం, లోకం - లోకులు ఏకమై విమర్శించే విమర్శనలకు తలవొంచి, వెలివేస్తే భరించి ఒంటరిగా

జీవించటానికి జంకని మనోధైర్యం ఉందా? సమాధానం చెప్పు!"

తాతయ్య వేసిన ప్రశ్నలు ఓ నిమిషంలోనే జవాబులు చెప్పలేనివి. అందుకే ఏం మాట్లాడలేకపోయాను

"అది సరే. ఏమనుకోకు. మనలో మనమాట. అసలీ కళ్యాణి సంబరెంత?" గుబురుగా పెరిగిన మీసాల్ని నిమురుకుంటూ చిరునవ్వుతో అన్నారు తాతయ్య.

సంబరెంతేమిటనుకొని పైకి అదే అడిగాను.

నా ప్రశ్నకు తాతయ్య నవ్వుతూన్న వాడల్లా ఆగిపోయి నే నూహించలేనంత గంభీరంగా అన్నారు.

"ప్రతి మనిషికి ఆశలు - ఆశయాలు, కలలు- కన్నీళ్ళు ఉండాల్సిందే. కాని ఎంత వరకు? మన మనోధైర్యాన్ని మించనంతవరకు భూమిలో పునాదులు లేకపోకుండా గాలిలో మేడలు కట్టనంత వరకు. రాలే కన్నీరు రక్తంగా మారనంతవరకూ. కాని శృతిమించి రాగాన పడితే మిగిలేది నలుగురిలో నవ్వులాటే. పుస్తకాలలో వ్రాయబడి ఆచరించలేని ఆదర్శాలు కొన్ని ఉన్నాయి. ఏ వివాహ తలంపు అందులోకి చేర్చచ్చు. పది మందిలో అగ్ని సాక్షిగా వివాహమాడి పెనిమిటితో ఏడడుగులు నడిచిన స్త్రీకి ఇవ్వబడే గౌరవం మెళ్ళో మంగళ సూత్రం కట్టించుకోలేకపోయినా తన సర్వస్వం ప్రియుడి కర్పించి ఆతనినే ఆరాధిస్తున్న స్త్రీకి లభించదు. ఇద్దరూ స్త్రీలే. కాని హక్కులూ. బాధ్యతలూ వేరు. సంఘం వేసే ముద్రలు వేరు. ఏమంటావ్?" అంటూ నా వంక చూసాడు తాతయ్య.

తాతయ్య చెప్పిన విషయాలు చాలా వరకు నిజం!

కాని కళ్యాణిని వదులుకోటం ఎలా?

తల్లి చేసిన తప్పుకు తనయకా శిక్ష!

ఓ సిరికిసంద చేసిన మోసానికి మరో అమాయకురాలికా మచ్చ!

ప్రేమకు పర్యవసానం కళంకమా?

ఆరాధనకు ప్రతిఫలం అపనిందా?

పెద్దల భూతకాల యవ్వన వేడికి పిల్లల భవిష్యత్ సుఖస్వప్నాలు బలి పశువులా?

ఘోరం! అన్యాయం!! అక్రమం!!!

తాతయ్య నా ఆలోచనలు గమనించి మళ్ళా మొదలు పెట్టాడు.

"మనుషులు మారి ఆదర్శవంతులుగా రూపొందుతున్నారని. విశాల భావాలు పెంపొందించుకుంటున్నారని నువ్వు అపోహపడుతున్నావేమో. అది తప్పు! నాగరికత ఒకో మెట్టు ఎగబ్రాకుతూంటే మానవత్వం ఒకో మెట్టు దిగజారుతోంది. మన భావాల వెనకగా పెరిగే స్వార్థాన్ని మనం కప్పి పుచ్చుకుంటూ విశాల భావాలని ఆత్మద్రోహం చేసుకొంటున్నాం. మానవుడు సంఘజీవి అందుకే కళ్యాణిని నువ్వు వివాహం చేసుకునేందుకు వీలు లేదు. అవచన పదార్థానికో రుచి. కామానికో వరసా ఉండవు. బాగా ఆలోచించి ఓ నిర్ణయానికిరా. నా ఆస్తి. నా అండ నీకు లేకపోతే నీ నెత్తిమీద అర్థ రూపాయి పెట్టి ఆదివారం సంతలో వేలం వేసినా ఐదు పైసల కంటే ఎక్కువ రాదు జాగ్రత్త." అంటూ

చరచరా వెళ్ళిపోయాడు

• • •

నేను ఓడిపోయాను !

కళ్యాణిని వివాహం చేసుకోలేకపోయాను. కాని అందుకు కారణం నా పిరికితనం. తాతయ్య ఎరగా చూపించిన ఆస్తి మాత్రమే కావు. చెప్పా చెయ్యకుండా కళ్యాణి అకస్మాత్తుగా తల్లితో సహా ఎక్కడికో వెళ్ళిపోయింది. ఈ పలాయనంతో అంతరార్థం నేనంతగా అప్పట్లో అర్థం చేసుకోలేక పోయానుగాని ఇప్పుడు కళ్యాణి పరారుకు మూలకారణం తాతయ్యే నని నా ప్రగాఢ నమ్మకం. ఎంతోమంది చేత ఆదర్శవాది అని అనిపించుకున్నా తాతయ్య నా వివాహ విషయంలో పెను కంజవేసి నాకు తీరని అన్యాయం చేశాడు

• • •

నే నిపుడు మా ప్రాంతంలో కెల్లా పేరు మోసిన క్రిమినల్ లీడింగు లాయర్ని. శారద అనే లక్ష రూపాయల ఆస్తికి తాళికట్టి ఇద్దరు పిల్లల్ని కూడా కన్నాను. పెద్ద పిల్ల 'కళ్యాణి' ఐదో క్లాసు చదువుతోంది. వాడిగాడు విన్నే ఒకటో క్లాసు పుస్తకం కావాలని తెగమారాం చేశాడు. ఆస్తిపంపకాలు- హత్యలు. విడాకులు- దోపిడీలు లాంటి అనేక రకమైన కేసులతో నాకు ఓ క్షణం కూడా ఖాళీ దొరకటం లేదు. నిరుద్యోగ సమస్యవల్ల కాబోలు ఇద్దరు బి. యి. లు నా దగ్గర గుమాస్తాలుగా చేరారు. మెల్లిగా పలుకుబడి సంపాదించి ఓ నాలుగు పెద్ద కంట్రాక్టులు సంపాయించి వాళ్ళను సరిగా వాడుకోవాలి. ఎందుకైనా పనికి వస్తారని టీషాలు ఓ అర్ధ డజను కాని అద్దెకు—అద్దె గురించే కాదనుకోండి— తిప్పుతున్నాను. కార్మికులు మరీ మొహమాటం పెట్టటం వల్ల వాళ్ళ యూనియన్‌లో ఓ ఆనరరీ పొజిషన్‌ను నిర్వహిస్తున్నాను. ఈ మధ్యే ఓ సర్పంచి హత్యా కేసులో నా వాదనా పటిమవల్ల దోషు లిద్దరు 'పరిస్థితుల ప్రభావం వల్ల. ఆత్మరక్షణార్థం ఆయుధాలు ప్రయోగించటం జరిగింది' అనే నెపంతో నిర్దోషులుగా నిర్ణయింప బడటంతో నా స్థాయి కొంచెం పెరిగింది. నా శ్రీమతి శ్రీ శారదాదేవి ధర్మదేనువు గుర్తుతో మునిసిపల్ ఎలక్షనులలో పోటీ చేసి నెగ్గింది వచ్చేసారి జనరల్ పోటీలో

అదే గుర్తుతో పిందుకుందామని అనుకుంటున్నట్లు కూడా ఎప్పుడో చెప్పిందనే నాకు జ్ఞాపకం. ఇంత గజిబిజి గతుకుల జీవితంలో నాలోని మరో రావుడు అప్పుడప్పుడూ మేల్కొని కళ్యాణిని జ్ఞాపకం చేసి కాస్త విశ్రాంతి విస్తాడు.

"ఏదండి రావుడుగారూ ఏమిటిలా దయ చేసారు ?"

"ఏముంది. మామూలే."

"అంతా కుశలమేనా ?"

"ఆ! తమరి దయవల్ల."

"ఆహా! అలా అనకు. ఈ మధ్య చాలా పెద్ద వాడివై పోయావు కదూ. ప్రజలు మొహం మీద ఉమ్మేసినా తుడిచేసుకుని 'వరాయా సొమ్మా? మన ప్రజలదే కదా!' అని చిరునవ్వుతో సమాధాన పడేంతటి రాజకీయ వేత్త సహనాన్ని కూడా సంపాయించ చేసుకున్నావ్."

"వేళాకోళం చేస్తున్నావా ?"

"అబ్బే ఎంత మాట! మర్చి పోయావా ?"

"ఎవర్ని ?"

"ఎవర్నేమిటి? అజంతాని సుగుణాల ఖనిని. నీ పిరికితనంకు బలై పోయిన ఓ అబలను."

"నా కళ్యాణినా ?"

"అబ్బా!! పేరు కూడా జ్ఞాపకముందే."

"చాలా ఘోరంగా మాట్లాడుతున్నావు. నా సంగతి నీకు తెలియదా ? ఆమె జాడ తెలిస్తే రెక్కలు కట్టుకుని వాలతాను."

"అసలు బ్రతికే ఉందంటావా?"

"ఛీ ఛీ! అవేం మాటలు బ్రతికే ఉంటుంది. చూస్తాను. ఎప్పటికైనా ఆమెను చూసి తీరతాను.

"ఏమిటా నమ్మకం ?"

"చెప్పలేను."

"సరే. కళ్యాణి ఎలా చదువుతోంది?"

"నంబర్ వన్‌గా కళ్యాణిలో నాకు కళ్యాణి కనిపిస్తుంది."

ఆ పేరు పెట్టినందుకు తాతయ్య ఏమన లేదూ ?"

"లేదు. అదే ఆశ్చర్యంగా ఉంది."

"ఆశ్చర్య మేముందిలే. తాతయ్య చాలా మంచివాడు.

"ఆ! గొప్పే. ఆయన మంచితనం మన్వే చెప్పాలి. నాకు పనుంది గాని మళ్ళా కనిపించు. గుడ్‌నైట్."

"వెరీ నైట్!"

* * *

"కళ్యాణికి సీరియస్‌గా ఉందట. వెంటనే వెళ్లాలి పద." అంటూ తాతయ్య చాలా కాలానికి పలకరించి. హడావిడిగా ఆజ్ఞాపించే సరికల్లా నేను తెల్లబోయాను.

"ఎక్కడుంది?" అంటూ ఆతృతగా ప్రశ్నించాను.

"వివరాలు తరువాత. వెంటనే బయలు దేరు. నీ గురించి కలవరిస్తోందట. కనీసం ఆఖరు చూపుకైనా అందుకోవాలి." అన్నాడు తాతయ్య

ఉన్నపాటున వంద మైళ్ళ దూరంలో ఉన్న గమ్యస్థానంకు బయలుదేరాం కారులో.

తాతయ్య కూడా కళ్యాణిని మరిచి పోలేదన్న మాట ?

నా ఆనందానికి హద్దులేకుండా ఉంది నా అజంతాను కొన్ని సంవత్సరాలైన

తరువాతైనా చూడబోతున్నాము. కాని మరుక్షణంలో నన్ను విషాదం ఆవహించింది. కళ్యాణి నా గురించి కండ్లు కాయలుకాసేలా నిరీక్షించి మరణశయ్యపై ఎదురు చూస్తోంది.

నిరాశ, నిస్పృహ, దైన్యం, పశ్చాత్తాపం నన్ను దహించి వేస్తున్నాయి. ఒక్కసారి ఉన్న పాటున కళ్యాణి కాళ్ళ మీద పడి భోరున విలపించి, నా కన్నీటితో ఆమె పాదాలను అభిషేకం చెయ్యాలనిపించింది. నా తెలివి తక్కువతనం, తాతయ్య ఎరగా చూపించిన ఆస్థి, భవిష్యత్తుపై నేను స్వార్థంతో పెంచుకున్న బంగారు కలలు, ఆచరణ కందని ఆశయ సూత్రులు నన్ను మోసం చేసి నాకళ్యాణిని నాకు అందనంత దూరంగా విసిరివేశాయి. విసిరివేయబడ్డ కళ్యాణి వెర్రిగా చూస్తూ, నాకోసం ఆక్రోశిస్తూ, సొమ్మసిల్లి కొన ప్రాణంతో ఎదురు చూస్తోంది.

లేదు! నా కళ్యాణి చచ్చిపోటానికి వీల్లేదు. ఆ అజంతా అందం మట్టిలో కలవటానికి నేను ఒప్పుకోను. ఎవరేవి ఆ సౌందర్య పెన్నిధి పాతర పాలవటాన్ని నేను సహించను. నా ఆస్థి, నా పరువు, నా ప్రతిష్ఠ, నా సర్వస్వం కళ్యాణికి అర్పిస్తాను. ఆమెను కాపాడుకోలేని జీవితం నిరర్థకం.

విరుద్ధ భావాల సంఘర్షణతో నలిగిపోయిన నా మనస్సు నా స్వాధీనం తప్పిపోయింది.

* * *

నే వెళ్ళేసరికి అంతా అయిపోయింది.

కళ్యాణి చచ్చిపోయింది.

కాదు, కాదు! నిర్దాక్షిణ్యంగా నిలువునా హత్య చేయబడింది. దారుణంగా అవమానంతో ఖూనీ చేయబడింది. కర్కోటకంగా మానసికంగా వలిచివేయబడి నేలకూల్చబడింది.

ఆమె మృతదేహం చూడగానే నాకు విపరీతమైన వైరాగ్యం కలిగింది. ఎంత ప్రయత్నించినా ఓ కన్నీటి బొట్టు కూడా రాల్చలేక పోయాను. ఎవరీ కళ్యాణి! ఏమిటి మా అనుబంధం?

నే నెందుకు ఎవరికోసం బ్రతకాలి?

నాలాంటి ఓ చిన్న అల్పజీవి సృష్టిలో లోపిస్తే వచ్చిన నష్టం ఏమిటి! మానవ సృష్టి లేనపుడు ఈ లోకం ఎలా ఉండేది! మనుషులు ఎందుకు సృజించబడ్డారు!

నా ఆస్తి, తాతయ్య, కళ్యాణి, శారద, ప్లీడరీ ఏమిటివన్నీ? వీటివల్ల నే సాధించే దేముంది?

అంతా మిథ్య.. .సర్వస్వం మాయ!

ఎవ్విరిథింగ్ ఈజ్ నథింగ్!

ఈ లోకంలో ఎవరూ ఎవ్వరికీ ఏమీ కారు.

అంతా స్వార్థపరులు, వంచకులు, ద్రోహులు!

మెదడు తిమ్మిరెక్కి పని చేయటం మానేసింది.

లేతమలపాకులాంటి కళ్యాణి పెదవులు అర్ధచంద్రాకారంగా వంగి 'రామూ' అంటూ తియ్యగా కలవరించి నన్ను పిలుస్తున్నట్లుగా అనిపించింది.

నాకు ఏం మాట్లాడాలో తెలియటం లేదు. నిర్లిప్తంగా శూన్యంలోకి గాజు కళ్ళతో చూస్తూ కూర్చొండిపోయాను.

"నన్ను క్షమించు రామూ! కళ్యాణి మరణానికి నేనే కారణం. నా పాపానికి

విస్మృతిలేదు." అంటూ తాతయ్య చిన్న పిల్లాడిలా వలవలా ఏడవటం నాకు ఆశ్చ ర్యాన్నే కలిగించింది.

"కళ్యాణి ఇంకా బ్రతికి నాగురించి ఎదురుచూస్తోందని నాకు ఎందుకు తెలియ జేసావు తాతయ్య" అంటూ బాధగా ప్రశ్నించాను.

"అవసరం ఉంది. ఇదిగో కళ్యాణి వ్రాసి నీ కిమ్మన్న ఉత్తరం చదివితే నీకు అర్థమవుతుంది." అంటూ తాతయ్య నాకు ఓ ఉత్తరం అందించాడు.

డియర్ రామూ!

నీ అజంతా వ్రాసే కథసారి ఉత్తర సారాంశం ట్రాజడీయే ఐనా మన సాంప్ర దాయానికి కామిడీయే అవుతుంది. చరిత్రకు పునరుక్తి లక్షణం ఉందట.

నిజం నిప్పులాంటిది. కప్పబడ్డ నివురు ఎప్పటికో అప్పటికి ఎగరాల్సిందే. ఓ రహస్యం చెపుతాను. ఆశ్చర్యపోకు! అసహ్యించుకోకు! పూర్వ కాలంలో ఈజిప్టుదేశంలో అన్నాచెల్లెళ్ళు ఆధికారం కోసం వివాహాలుచేసుకునేవారట. నాభర్తగా వూహించుకున్న నిన్ను నా నోటితో మరో వరసపెట్టి పిలవలేను అందుకే ఈజన్మకు విడాకు లిస్తున్నాను. వచ్చే జన్మలో వద్దన్నా నీ భార్యగా పుట్టితీరతాను.

అమ్మను మోసం చేసి నా జన్మకు కారణభూతమైన నా తండ్రి నీకు పెద నాన్న. తాతయ్యకు వెరచి, అమ్మకు సరియైన సంజాయిషీ ఇవ్వలేక పరా రయ్యాడు. ఈ కథ చెప్పి తాతయ్య నన్ను పరారుచేయించాడు. జీవచ్ఛవంలా బ్రత కడంకంటే హీనమైంది మరోటి ఉండదు. ఆత్మహత్య పాపమని నాకు తెల్సు. ఐనా తప్పదు. ఇంక సెలవ్. నీ

కల్యాణి.

ఉత్తరం చదివిం తరువాత నా కళ్ళ ల్లోంచి రాలిన రెండు కన్నీటి బొట్లు కళ్యాణి గురించో లేక హైందవ సాంప్ర దాయానికి మచ్చ ఏర్పడకుండా నన్ను కాపాడి కాయ్య ఐపోయిన తాతయ్య గురించో నాకు తెలియలేదు!

---

# ఆదర్శాల అంచున

* అజ్జరపు హనుమంతరావు *



శరదృతువు........

సాయంత్రం అయిదు గంటలు దాటింది. ,ఎర్రటి వింత కాంతులీనుతున్న భానునితో ఆ భాగం పశ్చిమదిక్కు ఎర్రటిపట్టుచీర కట్టుకుని ప్రియుని ప్రథమ సమాగమంకోనం అరుణిమ దాల్చిన చెక్కిళ్ళలో తులికేనవ వధువులావుంది। కిటికీలోంచి ఆ దృశ్యమే చూస్తూ ఆఫీసులో పడ్డ శ్రమ మర్చిపోసాగాను. అప్పన్న వచ్చి.

"కారేజి తీసుకెళ్తున్నా బాబూ...." అంటూ హోటలుకెళ్ళిపోయాడు. అప్పటిదాకా పరువంలో పరవళ్లు తొక్కిన పశ్చిమపడచు ప్రియుడు వెళ్ళిపోవడంతో ముఖం అంతా చిఱుచీకట్లు పులుముకుని చిటపటలాడుతోంది।... ఉస్సురంటూ వెనక్కివాలాను.... గదిలో క్రమంగా చీకటి చిక్కబడుతోంది. లైటు వెయ్యాదానిక్కూడా బద్ధకంవేసి అలాగే కూర్చుండిపోయాను.

మనస్సంతా చికాగ్గావుంది. ఈవూరికొచ్చి వారంరోజులైనా యింకా ఎవ్వరి పరిచయంకాలేదు. వచ్చిన మొదటి రెండు రోజులు రూముకోసం తిరగడంతో సరిపోయింది. ఆఫీసువాళ్ళ ధర్మమా-అని

అది శ్రమలేకుండానే దొరికింది. ఆఫీసవగానే హోటల్లో కాఫీతాగి. రూముకొచ్చి ఈజీచెయిర్లో బయటికి చూస్తూ కూర్చోవటంతప్ప ఈ నాలుగురోజుల్లోనూ మరే పనీలేదు. ఇంటివాళ్ళ పనివాడు అప్పన్న 'కారేజి కి కుదిరాడు. ఏదున్నరకల్లా భోజనం ముగించి తొమ్మిదిగంటలదాకా పేపరు చదువుకోడం. పడుకోవడం-అదీ నాసాయంత్ర దినచర్య. విజయవాడలోవున్నప్పుడు హాయిగా గడిచిపోయేది! ఆలిండియా రేడియో ఫ్లూట్ ఆర్టిస్టు పూర్ణబిందు నారూమ్మేటుగా వుండేవాడు. ఇద్దరం కలిసి అయిదేళ్లు ఏ చీకూ చింతా లేకుండా కాలక్షేపం చేశాం. తీరికవేళల్లో పూర్ణబిందుని ఫ్లూట్ వాయించమని వేపుకు తినేవాణ్ని! విసుగులేకుండా ఎప్పుడడుగుతే అప్పుడు వాయించేవాడు తను. ఆగానంలో మైమరచిపోయేవాణ్ని. చిన్నప్పట్నుంచి సంగీతం అంటే చెప్పలేని అభిమానం నాకు. పూర్ణబిందు సాంగత్యంలో అది మరింత బలపడింది! రూములో రోజూ సాయంత్రంవేళల్లో క్రొత్త క్రొత్త రీతులు ప్రాక్టీస్ చేసేవాడు పూర్ణబిందు. శ్రమతో అలిసి వచ్చిన నేను ఆ మృదుల మనోహర వేణుగానంలో మైమరచి. పరవశించి పోయేవాణ్ని. అతను గంటలు తరబడి మైమరచి గానం చేసేవాడు. నేను కూడా వళ్ళు మరచి వింటూ మరో లోకంలో విహరించే వాణ్ని. సాధన పూర్తయిన తరువాత 'అబ్బా ...అప్పుడే తొమ్మిదైంది! అంటూ నన్ని లోకంలోకి తీసుకువచ్చేవాడు. పూర్ణబిందు. ఇద్దరం కలిసి భోజనం చేసేవాళ్ళం.

పూర్ణబిందుతో కలిసి అనేకమ్మంది పెద్ద పెద్ద విద్వాంసుల కచేరీల కెళ్ళేవాణ్ని నేను. నా సంగీత తృష్ణ చూసి. ఒకసారన్నాడు పూర్ణబిందు-

''ఏం స్వామీ! సంగీతం అంటే నీకింత యిష్టం కదా—ఏ సంగీత సరస్వతి నేనా పెళ్ళిచేసుకోకూడదా! నువ్వు ఆఫీసు నుంచి రాగానే సంగీతంతో నిన్ను మైమరపిస్తుంది. నాకు శ్రమా తగ్గుతుంది.

''అలాగే కానీ.. పిల్లని చూపి నువ్వు సర్టిఫై చేస్తే అమ్మాయిని చూడకుండానే తాళి కట్టేస్తాను . ." అన్నా.

''నిజంగానా?'' అన్నాడతను.

''ఏం? అనుమానిస్తున్నావా?" సవాల్ చేశాను.

''నేనా అమ్మాయిని సంగీతంలో ఎప్పుడో సర్టిఫై చేశాను. కాని నువ్వా అమ్మాయిని మాత్రం చేసుకోవు."

''వేళాకోళం ఆడకు బిందూ! అయినా చేసుకోనని నువ్వేలా అనుకుంటున్నావు?''

''చేసుకోవు. అంతే!"

''అమ్మాయి అందంగా ఉండదా?''

''అప్పరస...''

''వయస్సులో నాకంటే పెద్దదా?"

''నీకంటె అయిదేళ్ళు చిన్నది!''

''పోనీ ఆ అమ్మాయి నడత మంచిది కాదా?''

''ఛీ... చాలా మంచిదా అమ్మాయి''

''బాగా బీదవాళ్లా . వాళ్ళు?''

''ఏం బీద పిల్లయితే చేసు కోవా?''

''ఏమోలే! బీదపిల్లయితే చేసుకోకూడదని నా అభిప్రాయమని దురుద్దేశపడుతున్నావేమోనని . ."

''కాదు ...మధ్య తరగతి కుటుంబం వాళ్ళది ''

"మరేమిటి చెబుదూ నన్ను చంపక."

"ఆ అమ్మాయి మూగది..."

త్రుళ్ళిపడ్డాడు.

"అవును స్వామీ వయొలిన్ అద్భుతంగా వాయిస్తుందామె! అందంలో అప్సరస! కానీ...పాపం మూగది! మా ఊళ్లో వుంది! చేసుకుంటావా మరి!!" అన్నాడు నవ్వుతూ పూర్ణబిందు.

నా కెక్కడలేని పౌరుషము వచ్చింది.

"ఈ క్షణం నడు మీ వూరికి ...నేనా అమ్మాయిని చేసుకోడానికి సిద్ధం ..." అన్నాను. లేస్తూ.

"అంతా వట్టిదే స్వామీ ...నువ్వేమంటావోనని సరదాకికల్పించి చెప్పానులే!!" అంటూ తేల్చేశాడు, పూర్ణబిందు.

నా ఉత్సాహం అంతా చప్పగా చల్లారిపోయింది.

"బిందూ... నన్నెంత తక్కువగా అంచనా వేశావు! అంతటి సంస్కారిగా కనిపించానా నేను! నాకూ ఆదర్శాలున్నాయి. అటువంటి కన్య కనిపించాలే గానీ, మూగదేకాదు కురూపి అయినాసరే వివాహం చేసుకునితీరతాను!! నాక్కావలసినది సంగీతం! అందులో ప్రావీణ్యం గడించిన కన్య!" అన్నా. ఆవేశంగా.

"అయాం సారీ... స్వామీ!! నిన్ను నొప్పించాను! నన్ను క్షమించు ..." అన్నాడు పూర్ణబిందు నొచ్చుకుంటూ.

ఆ తరువాత వారం రోజులకే నాకు ట్రాన్స్‌ఫర్ అయింది.

పూర్ణబిందు ఎలా ఉన్నాడో ...!!

"బాబూ! కారేజీ ..."అన్న అప్పన్న పిలుపుతో ఈ లోకంలో కొచ్చాను.

* * *

సుపరిచితము. నాకత్యంత ప్రియము అయిన హంసధ్వని రాగం సుతారంగా చెవులకి తాకేసరికి అప్రయత్నంగా మెలకువ వచ్చింది! అలారం టైంపీస్ పావుతక్కువ ఏడు సూచిస్తోంది. ఆశ్చర్యపోతూ దిగ్గున లేచి కూర్చున్నాను. ప్రభాతసమయాన పక్షుల కిలకిలా రావాలని చీల్చుకుంటూ వస్తున్న ఆ వీణానాదం ఎక్కడినుంచి వస్తున్నదో తెలుసుకోవాలని మనస్సు ఆతృతపడసాగింది. కిటికీ తలుపు తెరిచాను. తెల్లటి మంచుతో ప్రకృతి కాంత తెల్లటి శాటిన్‌చీర కట్టుకున్నట్టుంది! రాగాలాపనపూర్తయి 'వాతాపిగణపతింభజే ..' కీర్తనఎత్తుకుంది వీణ. వారం పది రోజులై సంగీతానికి కరువైన నామనస్సు మీదాగానం పూలవాన కురిపించింది. తన్మయత్వంతో వింటూ అలాగే మంచంమీద కూర్చుండిపోయాను. కిటికీలోంచి సూర్య కిరణాలు ఎర్రగా చుర్రుమనిపించాయి ... గానం ఆగి ఎంతసేపయిందో తెలియక బయటికి చూశాను తెల్లగా తెల్లవారిపోయింది...వీధి తలుపు ఎవరో తట్టడం వినిపించి, గబగబ తువ్వాలు పైమీద వేసుకుని తలుపు తీశాను. కాఫీగ్లాసుతో లోపలికొచ్చాడు, అప్పన్న. గ్లాసు టేబులు మీదుంచి చీపురుతీసుకున్నాడు.

"అప్పన్నా ." టూత్‌పేస్టు బ్రష్ మీదవేస్తూ పిలిచాను.

"ఏంబాబూ ." ఊడుస్తూనే అడిగాడప్పన్న

"ఈ చుట్టు ప్రక్కలెవరేనా వీణ వాయించేవాళ్లున్నారా?"

"లేకేటిబాబూ .. ఎదురింట్లో పెద్దమ్మాయిగోరు రోజూ పొద్దున. సంజేల

వాయిస్తూనే ఉంటారు......" అన్నాడు అప్పన్న.

సందేహనివృత్తి అవడంతో మనస్సు తేలికపడ్డట్టయింది ..

• • •

సాయంత్రం రూము కొచ్చేసరికి అయిదున్నరయింది .. ప్రొద్దుట విన్న వీణానాదం యింకా మనస్సులో మెదులుతూనే ఉంది. సాయం సమయాల్లోకూడా ఆవిడ వాయిస్తుందని అప్పన్న చెప్పాడు. వాయిస్తుంటేమోనని వీణానాదం కోసం చాలాసేపు ఎదురుచూశాను. కాని అలాంటి ఛాయలేవి కనుపించలేదు. రూములో కొంతసేపు అటు యిటు పచారు చేశాను. మనస్సులో ఒక ఆలోచన చటుక్కున మెదిలింది. వెంటనే లుంగిమీదే బనీను. శ్లాకు వేసుకుని ఎదురింటికి బయలుదేరాను. గేటు దాకా వెళ్ళి. తలుపు పైనుంచి చూశాను. దాబా ముందు వసారాలో ఈజీ ఛెయిర్లో కూర్చుని ఒకాయన పేపరు చదువుకుంటున్నాడు. వయస్సు ఏభయి-అరవై మధ్యలో ఉండవచ్చు. మొహం కనుపించటంలేదు. నెమ్మదిగా తలుపు తెరచుకుని లోపలి కెళ్లాను.

"నమస్కారం అండీ " అన్నా.

పేపరు ప్రక్కకు తొలగించి, పైకి లేస్తూ....

"నమస్కారం .. రండి!!" అంటూ కాయాన్ని ముందుకు కదిలించి, ప్రక్కనే ఉన్న కుర్చీలో కూర్చోమన్నట్టు చెయ్యి చూపించా రాయన.

కూర్చున్నాను.

"మీ ఇంటి ఎదురుగా ఉన్న దాబాలో అద్దె కుంటున్నాను! నా పేరు స్వామి!" నన్ను నేను పరిచయం చేసుకున్నాను.

ఆయన ప్రశాంతంగా చిరునవ్వు నవ్వారు.

"అవును! రోజూ మిమ్మల్ని చూస్తూనే ఉన్నా! ఏ డిపార్టుమెంటులో పని చేస్తున్నారు!"

పేపరు మడిచి ప్రక్కనే పెడుతూ సర్వసాధారణంగా అడిగా రాయన.

చెప్పాను.

ఆ తరువాత మా యిద్దరి మధ్య మామూలుగా ఇద్దరు కొత్త పరిచయస్థుల మధ్య జరిగే సంభాషణే జరిగింది. మాటల్లో ఆయన పేరు భైరవమూర్తిగారని తెలిసింది.

"అయితే మీకు సంగీతం అంటే




చాలా ఆసక్తి అన్నమాట...'' అన్నారు భైరవమూర్తిగారు నవ్వుతూ.

''అవునండి! ప్రఖ్యాత రేడియో ఆర్టిస్టు పూర్ణబిందు నా రూమ్మేటు! అతన్ని వదలివచ్చిన దగ్గర్నుంచిపిచ్చెక్కినట్టుగా ఉంటినాకు ...'' అన్నా.

''అ తృష్ణ అల్లాంటిది లెండి....'' అని, కాసేపాగి-మళ్లా అన్నారాయన''.... అయితే పూర్ణబిందుగారు మీరూమ్మేటన్నమాట! అతనంటే మా కెంతోగౌరవం!! మావీణసంగతి సరే సరి!! ఎంత రాత్రయినా సరే రేడియోలో ఆయన ప్రోగ్రాం మాత్రం విడిచిపెట్టదది. ''

"వీణంటే ...??'' ఆసక్తి ఏమాత్రం పైకికనిపించనీయలేదు. నేను.

''మా పెద్దమ్మాయి లెండి ...''అని, ''అమ్మా వీణా....'' అంటూ గట్టిగా పిలిచారాయన. నాకళ్లు ఆతృతగా ద్వారం వేపు మళ్ళాయి...కర్టెనుమీద చెప్పలేని కోపం వచ్చిందప్పుడు. నాకు ప్రొద్దుట తనగానమాధురిలో ముంచెత్తిన ఆమె మూర్తి ఎలా ఉంటుందో చూడాలన్న ఆర్తితో మనస్సు తహతహలాడింది. అంతలోనే రెండు తెల్లటి పాదాలు కర్టెను ప్రక్కకి అలవోకగా తొలగింది బాగుండదేమోనని చూపు మళ్ళీ భైరవమూర్తిగారి వేపు మళ్ళించాను.

తండ్రి ప్రక్కగా వచ్చి నిలుచుందామె ...

''చూడుతల్లీ! ఈయన స్వామిగారని ఎదరింట్లోదిగారు. ఇక్కడకు రాకపూర్వం విజయవాడలో ఉండేవారట! రేడియో ఆర్టిస్టు పూర్ణబిందు ఈయనకి రూమ్మేటుట .''

అన్నారు భైరవమూర్తిగారు. నన్ను పరిచయం చేస్తూ.

సన్నగా, తెల్లగా సన్నజాజి మొగ్గలా ఉందామె! తలంటిపోసుకున్న నల్లటి

కుడుల విశాలమైన వక్షస్థల పాలభాగం మీద గత్తరగా అల్లరి చేస్తుంటే, వాటితో వృథా ప్రయాసచేస్తున్నాయామె నన్నటే. తెల్లటి వ్రేళ్లు!! తంత్రి చెప్పిన మాటలకామె చిరునవ్వు నవ్వి, సోగ కన్నులతో ఓరగా నావేపు చూసింది. ఆ చూపుకి నా మనస్సు ఝల్లుమంది!! ఏదో సూటిగా వచ్చి నా మనస్సులో మెత్తగా నాటుకున్నట్టయింది.

"నమస్కారం అండీ...." అన్నా. నేనే ముందుగా....

ప్రతి నమస్కారం చేసిందామె! అప్పుడామె గాజులు గలగల లాడాయి. ఆ శబ్దం ఎంతో హాయిగా ఉంది నా చెవులకి.

"మీరు వీణ చాలా బాగా వాయిస్తారు! ఎవరి దగ్గర నేర్చుకున్నారు?" అన్నా.

అంతే!!

ముగ్ధమోహనమైన ఆమె రూపం ఏదో కలవరపాటుతో కలతబారింది. తనూలత విలువెల్లా కంపించింది. కంపిస్తున్న పెదవులను అదుపులోకి తీసుకుంటూ దాదాపు పరిగెడుతున్నట్టు లోపలికి వెళ్లిపోయింది.

మ్రాన్పడిపోయాను.

నే నడిగినదాంట్లో తప్పేముంది? గురువుగా రెవరని అడగటం తప్పా!?

అయోమయంగా భైరవమూర్తిగారి వేపు చూశాను. ఆయన ముఖం నల్లగా మాడిపోయి ఉంది!!

వాళ్ళ ప్రవర్తన నా కర్థం కాలేదు.

గంభీరమైన మౌనముద్ర వహించారాయన. ముళ్ళమీ దున్నట్టుంది నాకు....

"వస్తానండీ.... నమస్కారం...." అని బయటికి వచ్చేశాను. రోడ్డంతా చీకటిగా ఉంది. గబగబా రోడ్డు దాటి రూముకొచ్చి పడ్డాను.

మనస్సుకూడా బయటి ప్రకృతిలాగే చీకటిగా తయారైంది. అప్పన్న వచ్చి దీపంవేసి, 'కారేజీ' పెట్టి వెళ్ళిపోయాడు.

... ఆ రాత్రంతా నిద్రపట్టలేదు. నేను వేసిన ప్రశ్న కెందుకామె పదవం అల్లా వాడిపోయింది? ఎందుకలా సమాధానం యివ్వకుండా వెళ్ళిపోయింది? మునలాయన ఎందుకలా మౌనముద్ర వహించాడు? అన్న ప్రశ్నలే సమాధానంకోసం మనస్సు తికమక పడి ఆఖరి కెప్పుడో నిద్రలో కొరిగింది.

ప్రొద్దునే మళ్ళీ హంసధ్వనిరాగంతో మెలకువ వచ్చింది. రాత్రంతా నిద్ర లేకపోవడంవల్ల కళ్ళు మండుతున్నాయి.... తల నొప్పిగా ఉంది. మళ్ళీ నిన్నటి సంఘటన మనస్సులో కలుక్కుమంది! చెవులు సంగీతం వినడానికి సత్యాగ్రహం చేశాయి. ఆఫీసుకి వెళ్ళబుద్ధి పుట్టలేదు. సెలవు రాసి అప్పన్నచేత ఆఫీసుకి పంపించేశాను. కళ్ళు మూసినా, తెరిచినా వీణ ముగ్ధమోహన రూపం సాక్షాత్కరిస్తోంది!

వారం రోజులు గడిచాయి ..

ఆలోచించాలోచించి చివరికొక నిర్ణయాని కొచ్చాను. పూర్ణబిందు నర్జంటుగా బయలుదేరి రమ్మని టెలిగ్రాం యిచ్చాను.

మర్నాడు సాయంత్రానికి పూర్ణబిందు వచ్చాడు.

"ఏం గురూ! ఏం జరిగింది? అర్జంటుగా రమ్మన్నావు....!!" అన్నాడు. వస్తూనే.

జరిగినదంతా చెప్పాను పూర్ణబిం

మతో

"నీతులేంటే నేను బ్రతకలేను బ్రదర్! ఈ నిర్ణయం క్షణికమైనం దనుకుంటున్నా నేమో—వారం రోజులు ఆలోచించి మరీ ఈ నిర్ణయాని కొచ్చాను నీతి వాది కాకపోతే పిచ్చివాణ్ని యిపోతానేమో! ఆమె నా కోసమే పుట్టింది బిందూ!" అని కాసేపాగి—

"నువ్వంటే వాళ్ళకి విపరీతమైన అభిమానం గౌరవమూను కూడా నా అన్న వాళ్ళెవరూ లేరు! నువ్వే వెళ్ళి యీ విషయము తెలిపి పెళ్ళికి వాళ్ళ నొప్పించాలి" అన్నాను ఆవేశంగా

అన్నీ విని నిట్టూర్చాడు పూర్ణబిందు

"నువ్వే వెళ్ళి కదపలేకపోయావా"

అన్నాడు కాసేపాగి

"అధైర్యం నాకు లేకనే నిన్ను రమ్మన్నది శ్రీప్రొద్దున్నే నువ్వు వెళ్ళి విషయం సానుకూలంచేసుకు రావాలి" అన్నా

అలాగేనన్నాడు పూర్ణబిందు

మర్నాడు ప్రొద్దున్నే హంసధ్వని రాగం మమ్మల్నిద్దర్నీ మేల్కొలిపింది

"అదృష్టవంతుడివి స్వామి నువ్వెన్నుకున్న అమ్మాయి నిజంగా సంగీత సరస్వతే!"

అన్నాడు తృప్తిపూర్తిగా విన్న తరువాత పూర్ణబిందు

గర్వంగా తృప్తిగా నవ్వాను. స్నానం ముగించి ఎదురింటికి వెళ్ళాడు. పూర్ణబిందు నిముషాలు లెక్కపెడుతూ కూర్చున్నాను

గంట గడిచింది

పూర్ణబిందురాలేదు! మనస్సు పరిపరి విధాల పరుగెత్తసాగింది పూర్ణబిందు ఆనందసంగతి యింకా చెప్పలేదా?

భైరవమూర్తిగారు ఒప్పుకుంటారా? ముక్కూ ముఖం తెలియని వాడికి పిల్లని ఇవ్వడం ఎలా? అని నిరాకరిస్తారేమో! ఒకవేళ ఆయనొప్పుకున్నా - వీణ ఇష్టపడుతుందా? ఇత్యాది ప్రశ్నలు కందిరీగల్లా మనసుని కలవరపరచాయి......

ఎదురుచూసిన క్షణం ఎదురు దూకింది. పూర్ణబిందు లోపలికొచ్చారు .. అతని ముఖం పరీక్షగా చూశాను. అతని ముఖంలో ఎక్కడా ఉత్సాహంలేదు! "ఏం బిందూ...ఏంజరిగింది? ఏమన్నారువాళ్ళు? అంగీకరించారా? వీణకి నేనంటే ఇష్టమేనా? .. " గుబగుబలాడే మనస్సుతో గబగబా అడిగా...

"అంగీకరించే వంతు నీదే స్వామీ!"

అతని గొంతులోని నిరాశ నన్ను ఆశ్చర్యపరిచింది. నా అంగీకారమే తుది నిర్ణయమై నప్పుడు ఇతనెందుకిలా వున్నాడు!!?

"నే నెప్పుడో ఆమెను చేసుకోవాలని నిర్ణయించుకున్నాను కదా ..."

"ఎప్పుడో కాదు. ఇప్పుడంగీకరించాలి! ఆ అమ్మాయి భవిష్యత్తు నీ చేతుల్లో ఉంది స్వామీ. నిర్లిప్తంగా ఉన్న వీణ మనస్సుని నువ్వే కృతి చెయ్యాలి."

"పువ్వుల్లో పెట్టి పూజించుకుంటాను! మనసారా ఆరాధిస్తాను... నాక్కావలసిందల్లా వీణ ."

"రైటే!! కాని నువ్వా అమ్మాయిని గురించి పూర్తిగా ఆరా తియ్యలేదనుకుంటున్నాను స్వామీ...."

"తెలుసుకోడాని కేముంది? వాళ్ళది సాంప్రదాయమైన కుటుంబం! మా కులం, వాళ్ళ కులం కూడా ఒకటే! సంగీతంలో సరస్వతి! అందంలో అప్సరస! చాలు.... ఇంకేం ఆరా తియ్యనక్కరలేదు ... బిందూ! వాళ్ళంగీకరిస్తే నేను సిద్ధం."

"కానీ...." పూర్ణబిందు కంఠం వణికింది.

"కాని ...?" భయం భయంగా అడిగాను పూర్ణబిందు ప్రవర్తన నన్ను పూర్తిగా కలవరపరచింది. ఏం వినవలసి వస్తుందోనని మనస్సు తత్తరపడసాగింది.

"వీణ మూగపిల్ల.. .స్వామీ ."

పూర్ణబిందు కంఠం జీరపోయింది. నెత్తిమీద పెద్ద ఇనపగుండు పడ్డట్టయింది. కాళ్ళక్రింద భూమి పెళపెళమని విడిపోయినట్టయింది! గొంతుదాకా వచ్చిన ఏడుపు పైకిరాక డెక్కువట్టింది...

"ఏంస్వామీ! నీకంగీకారమేనా? ఒకసారి నేనేదో వేళాకోళానికంటే నువ్వే అన్నావు జ్ఞాపకంవుందా! మూగపిల్లనైనా చేసుకుంటానని..."

అతన్ని పూర్తిగా చెప్పనివ్వలేదు

"నాకు కొంత వ్యవధికావాలి బిందూ! ఇప్పుడప్పుడే నేనేమీ చెప్పలేను......"

తలపట్టుకుని అలాగే మంచంమీద వాలిపోయాను...ఆ మధ్యాహ్నం పూర్ణబిందు వెళ్ళిపోయాడు.

• • •

మర్నాటినుంచి రూము బయటికి రావడం మానేశాను. బయటికొస్తే భైరవమూర్తిగారి కళ్ళపడాలి నేనే పెళ్ళి విషయం కబురంపాను. తీరా ఆయన పిల్చి, నా నిర్ణయం అడిగితే?? ...అన్న భయంతో బితుకు బితుకులాడిపోయాను. వారంరోజుల తరువాత పూర్ణబిందు పేర ఒక క్షమాపణ పత్రం రాశాను. అదే

అతనికి నేను రాసిన ఆఖరి ఉత్తరం!!

• • •

రిక్వెస్టు ట్రాన్స్‌ఫర్ మీద రాజమండ్రి వచ్చి అప్పుడే ఏడాదిదాటింది! ఈ ఏడాది లోనూ నాలో చాలా మార్పులొచ్చాయి! చాలా మారిపోయాను యిదివరకట్లా కాదు. యిప్పుడు రోజులో ఎక్కువసేపు మాట్లాడ్డమే పని!! నలుగురితోటి కల్పించుకుని వాళ్లొద్దనేవరకూ మాట్లాడ్డం నేర్చుకున్నాను. కొత్తకొత్త స్నేహితుల్ని సంపాదించాను. నాకింది వుద్యోగుల్ని చుట్టూ కూర్చోబెట్టుకుని ఉపన్యాసాలిచ్చి "షెభాష్! స్వామిగారన్నది నిజం! అబ్బ .. ఎంత విస్ఫూర్తిగా చెప్తారండీ." అనిపించుకుంటున్నాను. వాళ్ళలా అన్నప్పుడు ..."అవునండీ! మనిషికి ఆదర్శాలుండొచ్చు! అవి పాటించాలనెక్కడుంది! నరోజ్ . ఒకడికి సంగీతం అంటే మహాయిష్టం! అలాగని నలుగుర్ని మెప్పించడానికి సంగీతం వొచ్చిన ఒక అవిటి పిల్లని చేసుకున్నాడనుకోండి!! ...ఆహా!! ఏమి త్యాగం! ఎంతటి ఆదర్శసంపన్నుడు అంటూ లోకం వాణ్ని నెత్తిమీద పెట్టుకుంటుంది! అయితే తర్వాత వాడు ఆ అవిటి పెళ్ళాంతో పడే బాధ లోకానికి అక్కర్లేదు! అంతరాంతరాల్లో వాడనుభవించే యాతన ఎవ్వరికీ పట్టదు· కాని అందరి దృష్టిలోనూ వాడు ఆదర్శప్రాయుడే!!... ఎందుకొచ్చిన ఆదర్శం అది! అలాంటి ఆదర్శాలు పాటించి ఆత్మవంచన చేసుకునేకంటే వాటిని విస్మరించడంలోనే వుంది గొప్పతనం! ఏమంటారు?? "

యిలా సాగేవి నా ఉపన్యాసాలు!

"అంతేనండి!! . నిజమే మరి!!!..

అనేవాళ్ళు చాలామంది .

అంతే!! అదే నాకు తృప్తి!! సంతోషం!!

అయితే ఏది ఆత్మవంచన??! వాళ్ళకి తెలీదుగా!! నా అంతరాత్మకి మాత్రం తెలుసు!! కాని దాన్నెప్పుడో జోకొట్టేశాను. అందుకే సంగీతం అంటే అస్సలు నాకిప్పుడిష్టం లేదు!! అందులోనూ హంసధ్వని అంటే మంట!!! ఎక్కడయినా వీణ వినిపిస్తే. నా పొట్టలోని ప్రేగుల్నే ఎవరో మీటుతున్నట్టు అనిపించి. దూరంగా వెళ్ళిపోవడం నేర్చుకున్నాను.

ఆ రోజు ..

లంచ్ ఇంటర్వెల్లో పేపరు చూస్తున్నాను. రెండవపేజీలో "నూతన వధూవరులకు మా శుభాకాంక్షలు." అన్న హెడింగ్! క్రింద ఫోటోలో వరుడు ప్రఖ్యాత ఫ్లూట్ ఆర్టిస్ట్ చి॥ పూర్ణచందు!! వధువు చి॥ సౌ॥ వీణాదేవి !!!

పేపరు అప్రయత్నంగా చెయ్యి జారింది! ఆ విషయం గురించి ఏమాలోచించడానికీ నేను అనర్హుణ్ని!! అందుకే ఆ ప్రయత్నం విరమించుకున్నాను. *

---

ప్రొద్దుటలేచిన దగ్గరనుంచీ, సన్నాయి సాధన చేస్తున్న రాఘవుల్ని చూసి చీదరించుకొంటున్నది భార్యామణి ఏదో సణుక్కొంటూ. ఇహ విసుగెత్తి, రాఘవులు వాద్యం ఆపి. ఏమిటే. నీ సన్నాయి నొక్కులూ నువ్వూనూ ఆపుతావా. ఆపవా" అని గర్జించేడు.

---

# కనకమాలక్ష్మి

వేములరామశర్మ




"కొత్త రోడ్డు సార్."

క్లీనర్ పిలుపు బస్ బాడీ మీద అతను చేసిన చప్పుడులో కలిసిపోయింది.

"టికెట్! టికెట్ సార్!"

"రైట్! ట్వెల్వ్ వస్తుంది తొరగా పోనీ."

బాంబు పడ్డట్టు ఉలికిపడి ప్రాంప్ట్ యాక్షన్ తీసుకున్నాడు డ్రైవర్ ఫలితంగా నేను భయంతో మూసిన కళ్ళు మళ్ళీ తెరిచేసరికి రీడింగ్ రూమ్ స్టాప్ వచ్చేసింది. గబగబా బస్ దిగాను.

పేవ్‌మెంటు మీద ఆగివెనక్కి తిరిగే సరికి బస్ వెళ్ళిపోయింది. ఓ క్షణం స్థిమితంగా రోడ్డుకేసి చూసాను.

సెంటర్లో కానిస్టేబుల్ బీడీ కాల్చుకుందుకనుకుంటూ మూలనున్న కిళ్ళీ కొట్టు దగ్గరకి వెళ్ళి...అక్కడున్న చిన్నదానితో సరసాలాడుతూ వుండిపోయాడు.

ఇంతట్లోనే పాపం, అతని ప్రాణం తీస్తూ...రెండు కార్లు చెరోపక్కనుంచీ వచ్చి కీచుమంటూ సడన్ బ్రేక్స్‌తో ఆగాయి. కానిస్టేబుల్ పరిగెత్తుకొచ్చాడు.

అప్పటికి నేనో సిగరెట్ పూర్తిగా తగలేశాను నాకు కావల్సిన బస్ వచ్చి వెళ్ళిపోయింది. అందులో నేనాశించిన

వ్యక్తి మాత్రం దిగలేదు.

పట్టి పట్టి అడుగులేసుకుంటూ కనక మహాలక్ష్మి గుడికేసి నడిచాను నేను రోడ్డు రెండు ప్రక్కలా జాగ్రత్తగా చూసుకుంటూ.

"కొబ్బరి కాయలండీ! కాయ ముప్పావలా!

"బాబూ! పువ్వులండి"

"ఊదత్తులూ, కర్పూరం తీసుకోరూ."

జనం పల్చగానే వున్నా అమ్మకాల హడావుడి తగ్గలేదు. మరో పక్కన ముష్టి వాళ్ళు.

"బాబూ! పైసా!"




"ధర్మం చెయ్యండి బాబూ!"

"ప్రసాదమన్నా పెట్టు తల్లీ!"

యిలా అలపిస్తున్నారు వాళ్ళు.

"ఈ కాయం తోయ్!"

నేనడిగానో కొబ్బరికాయ చూపించి.

"ముప్పావలా" పాత పాటేపాడాడు.

"యిదో! చూడు! అంతా యిళ్ళకి పోతున్నారు. యింకా..."

"రేపు మళ్ళొస్తారు బాబు" అతను నా కంటే కొంచెం ఎక్కువే చదివాడు. ఆ విషయంలో.

"మరయితే..."

"అరపయా పైసలు తక్కువ లేదు బాబు."

నేను డబ్బులిచ్చి ఆ కాయ తీసుకున్నాను.

"ఊదత్తులూ, కర్పూరం" అడిగాడు నా తప్పుడు జ్ఞాపకం వచ్చింది.

అసలు నేనివాళ గుడికి రావడానికి కారణం ఆ మధ్య నెప్పుడో నేను జ్వరం పడినప్పుడు మా వాళ్ళు మొక్కుకున్నారుట. ఆ తర్వాత, తర్వాత, ఆ మొక్కువి "రెన్యూల్" చేసుకుంటూ వచ్చి నన్ను గట్టిగా హెచ్చరించారు. అమ్మవారికి పసుపు కుంకుమా, రవికల గుడ్డా కూడా పెట్టాలన్నారు. కర్పూరం తప్పవి నరిట నరే...నా చేతిలో మిగిలిన సరంజామా అంతా వుంది వాడి దగ్గర కర్పూరం తీసుకున్నాను!

"చెప్పులిక్కడ వుంచండి బాబూ!" అన్నాడు

అలాగే చేసి గుడివేపుకి నడిచాను. ఆ గుడి చాలా నిరాడంబరంగా, పందిరిలా వుంటుంది. ఆ మధ్య నెవరో ఒకాయన

అవిడకి పెద్దగుడి కట్టించే ప్రయత్నం చెయ్యబోతే...కలలో కనిపించి వద్దని వారించిందట. అది ఆవిడ నిరాడంబరత్వానికి చిహ్నమేమో.

గుడి ముందర గుంపులంతా తన్నుకుంటున్నారు. ప్రసాదం కోసం. కొందరు లోపలే వంచీల్లో పెట్టుకుని వెళ్ళి పోతున్నారు. కొందరు ఎవరికివ్వాలో అర్థం గాక యివ్వటం లేదు. ప్రసాదం పెట్టకుంటూ వెంటబడుతున్నారు వాళ్ళు. యింతలో ఓ కుర్రాడు ఎవరి చేతిలోదో ముక్క ఎగరేసుకుని పారిపోయాడు. ఆకలి అంతపని చేస్తుంది మరి. ఇంతలో ఓ షావుకారుగారు. అందర్నీ పంచుకోమంటూ చిన్న ముక్క గాలిలో ఎగరేశాడు. అది కాస్తా ఎవరో నోట్లో పడేసుకున్నారు.

నేను ప్రదక్షిణం చేసేలోపలకి వెళ్ళాను. అమ్మవారికి అన్నీ సమర్పించి. కొబ్బరికొట్టి నైవేద్యం పెట్టాను.

"బాబూ! ప్రెసాదం పెట్టావా" కటకటాల బయటనుంచి అమాయకంగా నవ్వుతూ. జాలిగా చూస్తోంది. ఓ పద్నాలుగేళ్ళ అమ్మాయి. పొడుగయిన జుత్తు. సంస్కారంలేక ఎర్రబడి. చిందర వందరగా. చింపిరిగా ముడివేసి వుంది. అప్పుడప్పుడే వికసించే అవయవ ప్రదర్శనని కాపాడుకోడానికి చిరిగిన బట్టలు శ్రమ పడుతున్నాయి.

"బాబూ!" ఆ అమ్మాయి జాలిగా మళ్ళా పిల్చింది.

"నీ పేరేమిటి?" నేను వెనక్కి తిరిగి ప్రశ్నించాను.

"కనక మాలచ్చి" అంది పెద్దనిచేసి.

"మీ నాన్న. అమ్మ...పేరు" అర్థం లేని ప్రశ్న వేశాన్నేను.

"కనకమాలచ్మి" యిలా అంటుంటే ఆ అమ్మాయి కళ్ళు లోపలి విగ్రహం కేసి అమాయకంగా చూశాయి భక్తిగా. బయట. నుంచే నమస్కరించింది. ఆ అమ్మాయిని చూస్తే నాకు జాలివేసింది. ఆలోచిస్తూ ఆమెనే చూస్తున్నాను.

"బాబూ!" నా ఆలోచన ఆమె ఆకలి తీర్చదన్నట్టు హెచ్చరించింది.

ఆలోచించకుండా నా చేతిలో కొబ్బరికాయ ముక్కని ఆమెకి అందించాను. అలా చేస్తుండగా జీర్ణావస్థలో వున్న అమె జాకట్టు చూడాల్సి వచ్చింది.

కనకమహాలక్ష్మి కూడా కన్నెపడుచే నంటారు. అటువంటి ఆమె సజీవమైన ఈ పిల్లరూపంలో కన్పిస్తోందని భావించుకున్నాన్నేను. కాకపోయినా ఓ కన్నె పడుచు మానాన్ని కాపాడటానికి తన బట్ట వుపయోగిస్తుంటే ఆ దేవి అగ్రహిస్తుందా?

చటుక్కున అక్కడ నేను పెట్టిన గుడ్డతీసి ఆ అమ్మాయి చేతిలో పెట్టాను. ఆ అమ్మాయి విచిత్రంగా చూసి. చేతులు జోడించింది. ఆ గుడ్డని. వింతగా. వంటి నిండా కప్పుకొంది. యింతలో, చుట్టూ కుర్రాళ్ళు వచ్చి ఆ అమ్మాయి దగ్గర గోల ప్రారంభించారు. ఆ పిల్ల తన చేతిలో వున్న కొబ్బరి ముక్కని. కట కటాలకి వున్న యినుప కమ్మికి వేసికొట్టి, ముక్కలు చేసి అందరికీ పంచేసింది. క్రమంగా ఆమె చేతిలో రవికల గుడ్డ ఒక్కటే మిగిలింది.

"తినండి. తినండి" అంటూ

నవ్వుతూ వాళ్ళనుదాటి ముందుకి బయలు దేరింది.

"హహ! పిచ్చిది" ఆ కు ఱ్ఱా ళ్ల కొబ్బరి నములుతూ ఆ పిల్లని చూసి నవ్వుకుంటున్నారు. నేను బరువెక్కిన హృదయంతో బయటకి వచ్చాను.

"ఏయ్! పిచ్చిదానా? ఆ గుడ్డ ఎక్కడ ఎత్తు కొస్తున్నావ్!" ఎవరో దబాయిస్తు న్నారు.

ఆ అమ్మాయి. లేదన్నట్టు భయ పడుతూ. నా వేపు చూసి సంజ్ఞ చేసింది. నేను పక్కనే వున్న సెంటర్‌లో కిళ్ళీ కొట్టు దగ్గరికి వచ్చి అటే చూస్తూ నిల్చు న్నాను.

కొందరు ఆ పిల్ల చుట్టూ చేరి ఏదేదో గేలిచేస్తూ అల్లరి పెడుతున్నారు. కొందరు పిల్లలు చిన్న చిన్న రాళ్ళు ఆ అమ్మాయి మీద విసురుతూ వినోదిస్తున్నారు. ఆ అమ్మాయి ఒక్కసారి నవ్వుతోంది. ఒక్కోసారి బాధతో చూస్తోంది

ఈ లోపులోనే నా పక్కగా ఓ కారు ఆగింది. అందులోంచి ఓ భార్యాభర్తలూ నలుగురు పిల్లలూ దిగి గుడివేపు నడిచారు

"ఏమండీ ప్రదక్షిణం చెయ్యండి" అంటున్న దావిడ మళ్ళీ కటకటాల దగ్గ రికి వెళ్ళి తన స్థానంలో నిల్చింది కనక మాలచ్మి.

"పిచ్చిది. పిచ్చిది" లోపలనుంచి ఆయన పిల్లలు వినోదంగా కేకలు వేస్తు న్నారు

"అమ్మా! ప్రసాదం పెట్టవా?" యధా ప్రకారం అర్థించింది.

మాట్లాడకుండా. ముక్క లన్నీ వంచీలో పెట్టుకుంటున్న దాయన భార్య

"అమ్మా! చిన్న ముక్క తల్లీ! ప్రసాదం" జాలిగా ప్రతిమాలుతూ వెంట బడింది కనకమాలచ్మి.

మిగిలిన పిల్లలు వీళ్ళు పెట్టేవాటం కాదనుకున్నారేమో దూరంగా వెళ్ళి పోయారు.

"అబ్బ! ప్రాణం తీసేస్తోంది. చిన్న ముక్క పారేద్దూ" అన్నాడాయన. ఆవిడ ముక్క బయటికి తీసింది. అది చూస్తూనే కాకుల్లా చుట్టూ మూగిపోయారు పిల్లలు ఆవిడ ముక్క పెట్టేదేమో.

ఇంతలో ఎటు చూసిందో కెవ్వు మంటూ అరిచింది కనకమాలచ్మి మరు క్షణం అక్కడలేదు. ఆ మరో క్షణంలో నేను చూడగల్గినదేమిటంటే.

ఒక గేదె-ఆ కార్లో ఆయన పిల్లాణ్ణి పొడవబోతోంది. అదే సమయంలో కనక మాలచ్మి నెట్టిన నెట్టుకి ఆ పిల్లవాడు తిన్నగా వచ్చి వాళ్ళమ్మ చేతుల్లోపడ్డాడు. మాలచ్మి గేదె పోటు తిని దాని కాళ్ళ కింద పడ్డది.

"అయ్యో!" అనుకున్నా నేను.

గేదెకూడా అప్పుడు చూసిందేమో తాను పొడిచింది తన ప్రత్యర్థి నికాదని. తప్పుకుని ఖిగ్రహంముందుని వెళ్ళి పోయింది.

యాదిలా వుండగా ఆ కార్లో ఆయన మాత్రం. రెండు క్షణాలు ఆ పడిపోయి నమ్మాయిని అదే పనిగా చూసి గబగబా కారెక్కి వెళ్ళిపోయాడు పిల్లలతో. ఆ గెదెతాలూకు మనిషెవరో పాపం. కనక మాలచ్మి దగ్గరికి వచ్చి నీళ్ళు జల్లుతోంది మొహం మీద.

"అంతా బగమంతుడి యిచిత్రం.

తను కూడా అదే కారులో తిరగ వల్సిన పిల్ల ఏం పెళ్ళాం! కాలమైన'' స్వగతంలా అనుకున్నాడు కిళ్ళీ బడ్డితాత.

"ఏమిటి తాతా!" ఆశ్చర్యంగా అడిగాను నేను.

''యింటావా బాబూ!'' వేదాంతం చెప్తున్నట్టు అన్నాడు.

''యిప్పుడా గేదె కింద పడింది ... ఆ బుల్లి అకార్లో ఎల్లినాయనకి కూతురు కానేటి పేద్దాం? ఈ విజానికి పాచ్చంలేదు. మనసూలేదు. తండ్రి ఎవడయితేనేమి! ఏం తల్లి అడు వదిమందిలో పెళ్ళి చేసుకున్న పెళ్ళాం కాదు. అందుకని యిదిక్కడ . అల్లక్కడ" నేను నిజంగా మూర్ఛితుణ్ణయ్యాను.

ఆ కారులో వెళ్ళి నాయనకి నేనెవరో తెలియకపోయినా, ఆయనెవరో నాకు తెల్సు. ఆ వూళ్ళో పెద్ద వ్యాపారి. మంచి పలుకుబడి వున్న మనిషి. నాలుగయిదు వంశాలలో గౌరవనభ్యుడు. ఆయన తల్చుకుంటే ...సూటిగా కాకపోయినా ఎవరి ద్వారానయినా ఏ విధంగానయినా ఆ పిల్లకి అంతో యింతో సాయంచేయవచ్చు. అను కోవచ్చు, తండ్రిగా కాకపోయినా. ధార్మికుడుగానయినా ''మరి వాళ్ళమ్మ యింతకి ఆయనకి సంగతి తెల్సా?'' అన్యమనస్కంగా అడిగాను.

అనుభవజ్ఞుడిలా నవ్వాడు తాత.

''అమ్మ! యిది పుట్టగానే సచ్చింది. బాబు .. అదూ వచ్చినట్టే దీని యిళయంలో .. ఎందుకంటే అడికి యిష యం తెల్సు. ఎలా తెల్సని అడక్కు బాబూ. తెలుసంతే'' ఏదో బాధతో అన్నాడతను.

నా మనస్సు వేడెక్కిపోయింది.

"ఒరే! ఏమిట్రా అలా నిల్చుండిపోయావ్. యిక్కడ కూడా ఆలోచన లేనా.''

నేను ఎదురు చూచిన వ్యక్తి వచ్చి భుజం చరిచే సరికి మళ్ళీ ఈ లోకంలోకి వచ్చాన్నేను. అయితే పూర్తిగా కాదింకా.

''నువ్వు గుడిలోకి వెళ్ళి వచ్చావా?'' అడిగాడు.

''ఆఁ నువ్వుకూడా వెళ్ళిరా యిక్కడే నిల్చుంటాను.'' అన్నాన్నేను. వాడు వెళ్ళాడు అమ్మవారి దర్శనం చేసికుందుకు. అయితే ఈ సారక్కడ కనకమాలచ్మి లేదు. ఆ వెలితి నాకు మాత్రం కల్పించింది. ఆ క్షణంలో నేనాలోచిస్తున్న విషయం...

యిందాక ఆ కుర్రాణ్ణి రక్షించి గేదె పోటు తినడంలో కనకమాలచ్మికి లభించినదేమిటి?

పుణ్యమా?

ప్రత్యుపకారమా?

సానుభూతా!

కృతజ్ఞతా?

ఆ కార్లో ఆయన చూపిన చూపుకి అర్థం ఏమిటి?

కృతజ్ఞతా?

సానుభూతా!

అభిమానమా?

ఆఖరు ప్రశ్న. యింకా అక్కడే పడివుంది కనకమాలచ్మి.

ఆమె బ్రతుకుతుందా?

బ్రతకాలా?

బ్రతకడమంటూ జరిగితే దేనికోసం?*

# సుభద్రావిజయం

A. శ్రీధర్



"కృష్ణా!"

పరచుకొన్నట్లు పచ్చగడ్డిపైన, చేయి చెక్కిలి కానించి, ఆకాశం, భూమి కలుసుకొన్న దూరాన్ని లెక్కిస్తూ, ఆలవోకగా, పడుకొని ఉన్న కృష్ణారావు ప్రక్కనే మోకాళ్ళ మీద తల పెట్టుకొని తీరుబడిగా విచారిస్తున్న విజయ్ వంక సాలోచనగా చూస్తూ, "లేరా విజయ్!"

అని. అభయ ప్రదానం చేసేవాడి భంగిమలో. 'విల్స్' పాకెట్‌లోని 'చార్ మీనార్' వెలిగిస్తూ అన్నాడు.

"ఈ సమస్య మరి విడే మార్గమే లేదా?" వీలైనంత నిస్పృహతో తనలో తాను గొణుక్కుంటున్నట్లుగా వాపోయాడు విజయ్

"ఎందుకు లేదు" సిగరెట్టు దమ్ము గట్టిగా లాగాడు కృష్ణారావు.

నమ్మకం లేనట్లుగా కృష్ణారావు వంక చూసి, సిగరెట్‌తో పాటు ఆలోచనలని కూడా పంచుకున్నాడు విజయ్.

వీళ్ళిద్దరినీ ఇంతగా కలవరపరిచే. 'బ్యాక్‌గ్రౌండ్'లోని అసలు కథ ఏమిటీ అంటే—

పదిహేను రోజుల క్రిందటి శుక్రవారం అది.

ఇంటికి పోయే దారి సగంలోనే మొదలైన సన్నని- వర్షపు జల్లుని నెట్టుకొంటూ, గబగబా రోడ్డు మలుపు తిరిగి విజయ్, అనుకోకుండా ఆగిపోయాడు.

ముందుగా కొన్ని గజాల దూరంలో, పుస్తకాల బరువుతో గుండెల్ని గట్టిగా హత్తుకుంటూ, తొందరగా ఇంటికి చేరుకోవాలనే ప్రయత్నాన్ని వదలకుండా కాళ్ళని ముద్దు పెట్టుకొంటున్న తడిసిన చీర; అడ్డు తగులుతూంటే, మాటి మాటికి కుచ్చెళ్ళు సర్దుకుంటూ నడుస్తోంది. అందమైన అమ్మాయి. సగం సగం తడిసిన చీర శరీరం మీద ఒంపుల్లో అక్కడక్కడ అతుక్కుపోయి ఏవేవో ఆలోచనలని రేపి. 'షడన్ బ్రేక్' వేసేసింది విజయ్ నడకకి.

ఎంతో తొందరగా ఇంటికి చేరుకొందామనుకొన్న వాడల్లా. ఆ అమ్మాయికీ, తనకీ మధ్య దూరం ఏ మాత్రం దగ్గరవకుండా ఎప్పుడూ లేనంత నింపాదిగా నడవసాగాడు విజయ్.

మరో రెండు మలుపుల తిరిగి, తనకి బాగా పరిచయమైన ఇంట్లోకే ఆ అమ్మాయి వెళ్లేసరికి, ఆశ్చర్యం రెట్టింపు అయి. ఆ రోజంతా విజయ్ ఆలోచనలని తన వశం చేసుకొంది.

మర్నాడు కృష్ణారావుని నిలదీసి అడిగితే తనకి చెల్లెలు వరస అని. ఇన్నేళ్ళూ మామయ్యగారింట్లో ఉండి చదువుకొనేదనీ. కొన్ని రోజుల క్రిందటే ఇక్కడికి వచ్చిందని చెప్పాడు.

అంతే!

ఆ రోజు నుండి, విజయ్ మనసు పారేసుకొని, అది ఆ అమ్మాయి దగ్గర ఉన్నదని తెలిసినా, అడిగి తెచ్చుకొనే సాహసం లేక తన బాధని ఎవరికీ వ్యక్తం చేయకుండా ఒంటరిగా కొన్నాళ్ళు గడిపాడు.

ఎంతో కష్టం మీద మిత్రుని ఆవేదనని తెలుసుకొన్న కృష్ణారావు ఆలోచనలో పడిపోయాడు. విజయ్ వ్యథ సహజమైనదీ, సమంజసమైనదీ అనే అనిపించింది కృష్ణకి. నిజానికి విజయ్, సుభద్రకి తగిన 'మేచ్' అనడంలో—సందేహం ఉండనక్కరలేదు అయితే ఆ మాట సుభద్ర ఒక్కగానొక్క అన్నయ్య. 'బలరామయ్య'కి అనిపించాలి కదా!

బలరామయ్య చాల విచిత్రమైన మనిషి. అతనికి ఈ కాలం కుర్రాళ్ళ 'పేషన్'లూ ప్రేమలూ అంటే. ఎంత మాత్రం ఇష్టం. నమ్మకం లేవు.






పని సానుకూలం చేసుకోవాలంటే బలరామయ్యని మంచి చేసుకోవటం తప్ప మరో ఉపాయం తోచలేదు కృష్ణారావుకి. ఆ మాటే అన్నాడు విజయ్‌తో.

"కాని ఎలాగురా! నువ్వే చెప్పావుగా నాలాంటి వాళ్ళంటే అగ్గిమీద గుగ్గిలం వేసినట్లు అవుతాడని" దీనంగా అన్నాడు విజయ్.

"మా అన్నయ్యకి, కథలన్నా, నాటకాలన్నా, గుఱ్ఱపు పందాలన్నా చాలా ఇష్టంరా! ఒక పని చేస్తే బాగుంటుంది. నిన్నొక రచయితగా పరిచయం చేస్తే, నీ మీద ఆటోమాటిక్‌గా ఇష్టం ఏర్పడిపోతుంది!"

"అమ్మ బాబోయ్!" అదిరి పడ్డాడు విజయ్. "తెలుగు కాంపోజిషన్ కాపీ కొట్టేవాణ్ని రచయిత నెలా అవుతానురా!"

"నాకు తెలుసు లేవోయ్! రచయిత అన్నంత మాత్రాన కథ వ్రాసి చూపించమనడులే. అయినా సొంత పేర్లతో కథలు వ్రాసేవాళ్ళు ఇవాళ రేపు ఎంత మంది ఉన్నారులే. ఏదో పేరు పెట్టేసుకో 'విజయశ్రీ' అనో 'కరుణశ్రీ' అనో బెడద వదిలిపోతుంది!"

"ఆ పేర్లు మాత్రం వద్దురా! మరీ అంత పరిచయమైన పేర్లు అయితే చిక్కే! ఏదో 'మోడరన్'గా ఉండే పేరేదో చెప్పు" ఉత్సాహం తెచ్చుకొంటూ అన్నాడు విజయ్.

"ఏం ముఖం. మోడరన్‌గా ఉండే పేర్లంటే అసలు పడదు. పాత పేర్లలోనే ఎవరూ పెట్టుకోని పేరేదన్నా పెట్టుకో!" ఆలోచనలో పడ్డాడు కృష్ణారావు.

* * *

ఇంటి ముందు కాంపౌండ్‌లో ఈజీ చైర్ మీద కూర్చొని దీక్షగా పుస్తకం

దువ్వుకుంటున్న బలరామయ్య గేటు తెరుచుకొన్న 'కిర్రు' చప్పుడుకి తెప్పరిల్లి వీధి వైపు దృష్టి నిలిపాడు.

ముందు కృష్ణారావు. ఆ వెనుక వీలయినంత వదులైన. తెల్లని బట్టలతో విజయ్ లోపలికి ప్రవేశించారు.

'ఎవరీ కుర్రాడు' అన్నట్లు చూశాడు బలరామయ్య తన వైపే వస్తున్న కృష్ణారావు వంక.

దగ్గర్లోనే ఉన్న రెండు కుర్చీలు తెచ్చి. విజయ్‌ని ఒక దాంట్లో కూర్చోమని చెప్పి. మరో దాంట్లో తను కూర్చొంటూ ఇది వరకు మీతో చెప్పాను కదా అన్నయ్యా: 'వ్యాస' అనే పేరుతో కథలు వ్రాస్తుంటాడని. ఇదుగో ఇతనే మా 'క్లాస్ మేట్' అన్న మాట. అసలు పేరు. 'విజయ సారథి' ఒక్క గుక్కలో పాఠం చెప్పినట్లు చెప్పాడు కృష్ణారావు.

"అలాగా" అన్నాడు బలరామయ్య. విజయ్ వంక కుతూహలంగా చూస్తూ.



కృష్ణ ఎప్పుడూ చెప్పిన జ్ఞాపకం లేకపోయినా. ఆ మాట బయటికి చెప్పడానికి ఇష్టంలేక:

విజయ్ చూపులు కాంపౌండ్ లోని గడ్డిని చీల్చుకొని. భూమిని గుల్లచేసి పాతాళంలోకి దిగబడి పోయాయి.

ఒక మాటు నఖశిఖ పర్యంతం విజయ్‌ని పరిశీలించి. తృప్తిగా అన్నాడు బలరామయ్య. "ఇదుగో ఇప్పుడే చదువు తున్నాను మీ కథల సంపుటిని. 'పరాజితులు' కథ చాల బాగుంది లేండి!" అని.

ప్రక్కలో బాంబు ప్రేలినట్టు అదిరి పడ్డాడు విజయ్ అంత వరకు బలరామయ్య సగం చదువుతూ స్టూల్ మీద పెట్టిన పుస్తకం వంక చూడనందుకు విచారిస్తూ.

కృష్ణారావు కూడా బలరామయ్య మాటలకి 'షాక్' తగిలి పుస్తకం వంక చూసాడు.

పుస్తకం పేరు 'సుమ వర్షం'. కథల సంపుటి రచయిత 'వ్యాస'.

'పరాజితులు' గురించి ఇంకా ఏదో మాట్లాడబోతున్న వాడల్లా. ఇంకా అతిథి మర్యాదలేవీ చెయ్యలేదన్న విషయం గుర్తుకి వచ్చి. "సుభద్రా!" అని కేక వేసాడు బలరామయ్య.

పరాజితునిలా ముఖం దించుకొన్న విజయ్. కొంత తెప్పరిల్లి. సుభద్రా లోకనా తత్పరుడై దృష్టిని గుమ్మం వంక నిలిపాడు.

మెరుపు మెరిసినట్లు కాఫీ కప్పులు నింపిన 'ట్రే'తో బయటకి వచ్చిందిసుభద్ర.

విజయ్ మనసుతో 'సుమవర్షం' కురి

పించి. స్టూల్ మీది 'సుమవర్షం' కృష్ణా రావు జేబులో చోటు చేసుకొంది.

"విజయ్ కథలు వ్రాయడమే కాద న్నయ్యా! నాటకాలలో నటిస్తుంటాడు కూడ అప్పుడప్పుడు. అదేమిటంది! 'చింతా మణి' లో 'పిల్ల మంగళుడా!' " మాట మార్చాడు కృష్ణారావు. విషయాన్ని 'సుమ వర్షం' మీద నుంచి తప్పించాలని.

"బిల్వ మంగళుడు" రేడియో ఆన్ చేసినట్లు చింతామణి మీద వ్యాఖ్యానం మొదలెట్టాడు బలరామయ్య.

బలరామయ్యని అలా వాగించడమే శ్రవణకి ఆరోగ్యకరం అని తెలుసుకున్న విజయ్ మధ్య మధ్య అతని మాటలకి తాళం వేస్తున్నటుగా ఆడిస్తూ. 'ఊ. ఆ' అన్నవన్ను అంటూ చాల శ్రద్ధగా వినడం మొదలెట్టాడు.

* * *

ఒక్కసారి మెరుపులు మెరిసి. ఆకాశంలో మేఘాల సంరంభం ఎక్కువయ్యే సరికి. చికాకుగా తల ఎత్తి చూసాడు బలరామయ్య.

ఇంటి దగ్గర బయలుదేరేటప్పుడు ఏమీ లేదు. దారిలో మొదలవుతుందేమో! ఏం చెయ్యడం!' అన్న ఆలోచనకి గురైన బలరామయ్యకి. 'హఠాత్తుగా దగ్గర్లోనే ఉన్న 'శకుని' ఇల్లు గుర్తుకి వచ్చింది.

'శకుని' అసలు పేరు 'శాస్త్రి' శకునాల మీద నమ్మకం ఉండటం. తనేకాక తన అనుయాయులచేత కూడా వాటిని 'తు. చ' తప్పకుండా పాటింప చేయడం వల్ల. మిత్రులు అందరూ కలిసి అతనికి 'శకునాల శాస్త్రి' అని బిరుదు ప్రసాదించారు. కాలక్రమాన శకునాల శాస్త్రి శాస్త్రి 'శకుని'గా మారిపోయింది.

బలరామయ్యని అల్లంత దూరంలోనే చూసిన శకుని పరుగెత్తుకొంటూ వచ్చాడు "మీ ఇంటికే వెళ్దామనుకొంటు న్నానోయ్! ఇంతలోకే వర్షం వచ్చి పడింది" అంటూ

ఇంట్లోకి వెళ్ళేసరికి అంత వరకూ ఏదో పేపరు దీక్షగా చదువుతున్న ఒక 'అబ్బాయి' వాళ్ళిద్దరినీ చూడగానే. లేచి నమస్కరించాడు.

"సుయోధనం అని! మా మేనల్లు డోయ్! విజయనగరం హైస్కూల్‌లో చదువుతున్నాడు. సెలవులకని వచ్చాడు" పరిచయం చేసాడు శకుని.

బలరామయ్య సుయోధనం వంక చూసాడు. సన్నగా బక్క పలచగా ఉన్నా ముఖం మాత్రం ఆకర్షణీయంగా ఉంది సుయోధనం తిరిగి నమస్కారం చేసాడు. రెండు వెదురు కర్రలు 'క్రాస్' చేసినట్టున్న ఆ వంతన్నా అందుకొంటూ అన్నాడు బలరామయ్య.

"మా సుభద్ర కూడా అక్కడే చదువుతోందోయ్! వాళ్ళ మామయ్య గారింట్లో ఉంటూ!" అని.

"ఆఁ? ఆ! ఆ సుభద్ర బాగా తెలుసు నటలే! వాళ్ళిద్దరూ క్లాస్ మేట్స్ కూడా నట!" అంటూ. "చూడు సుయోధనం ఆ చెక్కేదో అతనికి చూపించు మారు తుందేమో చెప్తాడు" అన్నాడు శకుని.

"చెక్కేమిటి!" అడిగాడు బల రామయ్య.

"అదేలే! మావాడు అప్పుడప్పుడు కాలక్షేపానికి కథలు వ్రాస్తూ ఉంటాడులే!

ఈ మధ్యనే ఏదో కథకి ఆ పత్రికల వాళ్ళు పారితోషికంగా ఒక 'చెక్కు' పంపించారు దానిని ఎలా మార్చాలో అని తికమక పడుతుంటే మీకు చూపిస్తే అవుతుందేమోనని అంటూ మేనల్లుడి చేతిలోంచి చెక్ అందుకొంటూ దూరం నుండే చూపించాడు కథని

"అబ్బే! నాకు కూడా బ్యాంక్ ఎకౌంట్ లేదే! అయినా ఏ పేరుతో వ్రాస్తూ ఉంటాడేం!"

సగంలోనే అందుకొని అన్నాడు సుయోధనం "వ్యాస అని ఏదో వ్రాస్తూ ఉంటాను లెండి అది"

రాయి కొట్టినట్లయింది బలరామయ్యకి "ఏమిటీ!" అంటూ బాహాటంగానే ఆశ్చర్యపోయాడు

"వ్యాసా! బలరామయ్య ముఖం కందగడ్డలా మారింది "చిన్నవే ఎవడో 'ఛటాఫోర్' వెధవ వచ్చి తనే వ్యాసనని చెప్పి వెళ్లాడే" ఆ పైన మాట రాలేదు బలరామయ్యకి కోపంతో పళ్ళు పట పట లాడాయి

"ఎవరూ! విజయ సారథి! తక్కున అన్నాడు సుయోధనం

"ఏమిటీ! మీకు తెలుసునా!" బలరామయ్య ఆశ్చర్యం రెట్టింపు అయింది

"తెలియకపోవడమేమిటి! ఏదో చిన్నప్పటి స్నేహితుడుకదా - అని ఊరుకోవడం గాని నా కలం పేరు వాడుకొని ఇలా ఎంత మందిని ఇలా మోసం చేసాడో!

"అలాగా! బలరామయ్యకోపం తారస్థాయి నందుకొంది "పద! ఈ నాటకంలో మా కృష్ణకి కూడా భాగం ఉన్నట్లుంది ఇంటికి వెళ్ళి వాడి పని పట్టాలి ఎందుకైనా మంచిది నువ్వుకూడా రా!" అంటూ సుయోధనం చెయ్యి పట్టుకొని బయల్దేరబోయాడు

"వీల్లేదంటూ అడ్డుపడ్డాడు కథని ఈ కథని కంఠంలో ప్రాణం ఉన్నంత వరకు ఇలా అర్ధాంతరంగా లేచి పోకూడదు కథనం చూసి బయల్దేరాల్సిందే నేను వీధి గుమ్మంలో నిలబడి కథనం చూస్తూ ఉంటాను మంచి కథనం కంటబడగానే గట్టిగా కేకవేస్తాను తక్షణం బయలుదేరి రండి అంటూ

కోపం పీకదాకా వచ్చినా చేసేది లేక తిరిగి కుర్చీలో కూలబడ్డాడు బలరామయ్య

పావుగంటమీద పావుగంట గడిచిన మరో పావుగంట తరువాత కథని పిలుపు ఇంచుమించు ఆర్తనాదంలా వినిపించింది "అయ్యయ్యో! దాటిపోతోంది వేగిరం రండి" అంటూ

గబాలున లేవబోయిన సుయోధనం కుర్చీతో సహా వెల్లకిలాపడ్డాడు

* * *

'ఈ సుయోధనం కథలు వ్రాయడం ఎప్పటినుండి మొదలు పెట్టాడో తెలుసునా!" సీరియస్‌గా అడిగాడు కృష్ణ

"ఏ సుయోధనంరా! విస్తుపోతూ అడిగాడు విజయ్ హఠాత్తుగా రూమ్‌లోకి ఊడిపడి వచ్చి రాగానే ప్రశ్న పరంపర మొదలెట్టిన కృష్ణని చూస్తూ

వాడేరా! చిన్నప్పుడు మనం ధనం అని పిలిచేవాళ్ళం"

"ఓహో! నాడా! మొన్న హఠాత్తుగా బజారులో కనిపించాడు విజయనగరంలో కనిపించాడు కథా అని రూమ్‌కి తీసుకు

వచ్చి...."

"ఆ తరువాత!" మధ్యలోనే అడ్డు వడ్డాడు కృష్ణ "నీ ప్రేమగాధ అంతా వాడి ముందు ఏకరవు పెట్టావా!"

"మాటల మధ్యలో అంతా చెప్పే శానమకో! అన్నట్టు వాడే సలహా ఇచ్చాడురా! 'వ్యాస' అని పేరు పెట్టుకోమని."

పళ్ళు పటపట లాడించాడు కృష్ణ. "గాడిద కొడుకు! ఎంత పని చేసాడు! నీకు సలహా ఇచ్చినట్టు ఇచ్చి. మా అన్నయ్యతో- తనే 'వ్యాస'నని. నువ్వొట్టి మోసగాడివని చెప్పాడు.

"ఏమిటీ!" ఆశ్చర్యపోయాడు విజయ్ నాకదంతా విన్న తరువాత. కంగ్రాచ్యులేషన్స్ అని. విష్ యూ సక్సెస్ అనీ. నీకైనంత సహాయం చేస్తానని అన్నాడు కా!"

"కొంప ముంచాడు." గట్టిగా అన్నాడు కృష్ణ. ఇప్పుడు మా అన్నయ్యకి అంతా తెలిసిపోయింది. నువ్వు కనిపిస్తే చితగకొట్టి. ఉప్పు పాతర వెయ్యాలని చూస్తున్నాడు. తరువాత నీ ఇష్టం."

ఈ ఆపదనుండి. ఎలాగైనా గట్టున పడే ఉపాయం చూడరా! అసలింతవరకు తెచ్చిన వాడివి నువ్వే!" దీనంగా కృష్ణ రెండు చేతులూ పట్టుకొన్నాడు విజయ.

"ఆ పట్టుకొనేదేదో మా అన్నయ్య చేతులే పట్టుకో నేనిందులో చెయ్యగలిగింది. ఏమీలేదు" విసురుగా వెళ్ళిపోయాడు కృష్ణ.

కృష్ణ వెళ్ళిపోయిన చాలా సేపటివరకూ బొమ్మలా అలాగే ఉండిపోయాడు విజయ్. తరువాత తేరుకొని. 'శకుని' ఇంటికేసి. బయల్దేరాడు. 'సుయోధనాన్ని' వెతికి పట్టుకోవాలని.

* * *

"ఉండరా! నీతో చాలా విషయాలు మాట్లాడాలి" డ్రెస్ చేసుకొని ఎటో బయలేదబోతున్న కృష్ణతో.కూర్చోమన్నట్లుగా కుర్చీవైపు సైగచేస్తూ అన్నాడు బలరామయ్య'

కృష్ణ కుర్చీలో సర్దుకొని కూర్చున్నాక అన్నాడు బలరామయ్య. వాళ్ళిద్దర్నీ అది వారంనాడు మన ఇంటికి పిలిచామురా!" అని.

అర్థంకానట్లు చూసాడు కృష్ణ

"అదేరా' విజయ్‌ని. సుయోధనాన్ని. ఇద్దర్నీ పిలిచాను. చిన్న పోటీ లాంటిది ఏర్పాటు చేసామత్. సుభద్రా పరిణయ ఘట్టాన్ని' ఎవరు బాగా వ్రాయగలరో చూద్దామని."

తన చెవులని. తనే నమ్మలేక అయోమయంగా చూసాడు కృష్ణ. 'విజయ్ కని పిస్తే. నమిలి మింగేయా లన్నంత మూడ్‌లో ఉన్న మనిషి ఒక్కసారిగా ఇలా మారిపోయాడేమిటి అని.

"విజయ్ మంచి కుర్రాడే' ఉదయం అలా మార్నింగ్ వాక్ కని తోటదాకా! వెళ్లి. దారిలో పర్సు పోగొట్టుకొన్నాను. అయిదువందల రూపాయల మొత్తం ఉన్నదిలే అందులో అదికాస్తా విజయ్ చేతిలో పడక పోయినట్లయితే దక్కి ఉండేది కాదనుకో!" విజయ్ మంచితనానికి మురిసిపోతూ, ప్రవాహంలా చెప్పుకు పోసాగాడు బలరామయ్య " విజాపికి విజయ్ కలం పేరు 'వ్యాస' కాదట 'వేదవ్యాస' అనే పేరుతో కాలేజీ మేగజైన్‌లో కథలు




వ్రాసేవాడట. ఇంకా పత్రికలలో పడలేదట. ఆ రోజు అంతా చెప్దామనుకునే. పాపం! సిగ్గుచేత, భయంవల్ల చెప్పలేక పోయాడట. నిజంగా పెద్దవాళ్ళంటే భయం భక్తి ఉన్నట్లే కనిపించాడులే. మహా-ఇదయిపోయాడనుకో-''

ఇదంతా ఎప్పుడు జరిగింది. సగంలోనే అడ్డుకొని ఆశ్చర్యపోయాడు కృష్ణ.

''విన్నానేరా!'' తోటలో కలిపాడు. తనకి కూడా, 'మార్నింగ్ వాక్'కి వెళ్లే అలవాటు వుందట. రోజూ డామ్ వైపు వెళ్ళేవాడల్లా ఆ రోజు ఎందుకో తోట వైపు వెళ్లామనిపించిందట. అలా రాబట్టి గాని, లేకపోతే అయినవందలు గంగలో కలిపిపోయేవే!''

''ఇంతకీ ఈ పోటీ ఏమిటి?''

''అదా! విజయ్ ఏర్పాటు చెయ్యమన్నదేలే! సుయోధనం విజయ్ ఇద్దరూ చిన్నప్పటి స్నేహితులేనట. సుయోధనం కథలు వ్రాస్తానంటే తనకి నమ్మకంలేదట అందుకే చిన్న పోటీలాంటిది ఇద్దరిమధ్య ఏర్పాటుచేసి చూడమని ఎవరు బాగా వ్రాయగలరో దాంతో బాగా తేలిపోతుందనీ అన్నాడు. 'నేను ఎందుకులే అని అన్నా: "లేదు. ఈ ఆదివారమే ఏర్పాటు చేయమని బలవంతం చేశాడు. నేను సరేలే! అని చెప్పి వచ్చేసాను."

''మంచిదేలే! దీంతో ఎవరు ఎలాంటి వారో తెలిసి-పోతుంది! ఇంతకీ సుయోధనునికి ఈ సంగతి తెలుసునా!''

''తెలియకపోవడమేమిటి! తనని ఇంటికి కబురు పంపించానులే! తప్పకుండా వస్తానని అన్నాడట''

''మంచిది. మరి నేను వెళ్లివస్తాను' అంటూ లేచాడు కృష్ణ. విపరీతమైన ఆతృత అతని మనసుని ఆవరించుకొంది. విజయ్ లాడ్జికెళ్ళి పూర్తి వివరాలు తెలుసుకోవాలని గబగబా అడుగు లేసాడు.

• • •

"ఇదంతా ఏమిటి!" దాదాపు అరచి నంత పని చేసాడు కృష్ణ.

"అది అంతే బ్రదర్! పవిత్రమైన ప్రేమని భగవంతుడు కూడా ఆపలేడని ఎవరో కవి అన్నట్లు జ్ఞాపకం. నాదీ, సుభద్రదీ అలాంటి ప్రేమే! దీన్ని అప టానికి ఆ సుయోధనానికిగాని, శకునికి గాని ఎలాంటి అధికారం లేదు . ."

ఇంకా ఏదో అలా చెప్పుకుపోతున్న విజయ్ వంకవిస్తుపోతూ చూసాడు కృష్ణ. "అది కాదురా! తెల్లవారి తొమ్మిదిన్నరకి గాని విద్రలేవని నువ్వు మార్నింగ్ వాక్ కి వెళ్ళడం ఏమిటి! మా అన్నయ్య నీ మీద అంత 'ఫ్లేట్' అయిపోవడం ఏమిటి! ఈ పోటీ ఏమిటి! సుయోధ నంతో పోటీకి నువ్వు నిలబడ గలవా! ఎవరో అన్నట్లు ఈ విషయంలో, అత గాడి కాలిగోరుకి గూడా..." క్లాస్ చదు వుకో లేదురా నువ్వు! చదివి ఉంటవులే! మీ నాన్నగారు ప్రైవేటు పెట్టించి ఏకంగా ధర్మఘారంలో 'జాయన్' చేసేసి ఉంటారు. లేకపోతే, తాబేలు- కుందేలు' కథ జ్ఞాపకం ఉండకుండా ఉంటుందా' పందెం వేసిన కుందేలు గతి ఏమయిందో తెలుసునా! ఆ పుస్తకంలోని 'లా' ప్రకారం తాబేలే గెలిచి తీరాలి! గెలిచి తీరాలేమిటి! గెలిచి తీరుతుంది! అంతే!"

విజయ ఆవేశాన్ని గమనించాడు కృష్ణ. సంభాషణ ఇలాగే సాగించి నట్లయితే, తనకి కావలసిన వివరాలు రాబట్టడానికి ఈ రోజంతా చాలదని తెలి సినవాడై, ప్రశ్నిపూరిత ధోరణిలో పడ్డాడు. "నిజమే విజయ్! తాబేలు గెలిచిన మాట నిజమే! కాని చూడు పర్సు దొరికిన మాట ఏక్సిడెంట్ అనుకొందాం. మరి ఈ పోటీ ఉన్నదే! దీంట్లో ."

"నో!" మధ్యలో అడ్డుపడ్డాడు విజయ "ఏక్సిడెంట్ కాదు ఇన్సిడెంటే ఆ పర్సు విషయంలో సుభద్ర సాయం ఎంతైనా ఉంది."

"సుభద్రా !"

"అవును సుభద్రే! ఆ సుయోధనం ఆమెకి ఏ మాత్రం నచ్చ లేదట వాడి కన్నా నేనే నయం అనిపించానట." చూశావా మాదెంత పవిత్ర ప్రేమో అన్నట్లు కృష్ణ వంక చూసి. "చిన్న ఉత్తరంలో మీ అన్నయ్య 'మార్నింగ్ వాక్'కి ఎటు వెళ్తాడో" వ్రాసి, అతగాడు బయల్దేరక ముందే, జేబులో పర్సు కొట్టేసి. మీ ఇంటి కాంపౌండులో నా కందేలా విసిరేసి. అతగాడి స్నేహానికి దోహదం చేసిందన్న మాట. తరువాత కథ అంతా నేను అల్లినదే:"

నిజంగానే కథలు అల్లేవాడిలా కని పించి, విశ్రాంతి పాలు చేసాడు విజయ్. కృష్ణారావుని.

మరి కాసేపటికి తేరుకొని, "అయితే ఇందులో 'సుభద్ర' ఇష్టం కూడా ఉందన్న మాట. మరేం అయితే! నువ్వు బెంగపడాల్సిన అవసరం లేదు. ఆ సుయోధనంగాడు. అసలు పరీక్షకే

జనాభా లెక్కలు సేకరించే ఒక ఉద్యోగికి పెండ్లి సంబంధం చూడ్డానికి ఒకరి యింటికి వెళ్ళారు. అమ్మాయిని తీసుకువచ్చి పెండ్లిచూపులకి కూర్చోపెట్టారు. ఆ ఉద్యోగిని (అంటే పెండ్లికొడుకుని) కూడా ఏమైనా ప్రశ్నలు అడగమన్నారు. ఆ ఆ ఉద్యోగి అలవాటు ప్రకారం వరుసగా "మీపేరుఏమిటి? "వయస్సెంత?" అని అడిగి "మీకు పిల్లలెంత మంది?" అనికూడా అడిగేసాడు.

—భమిడిపాటి సోమయాజి

---

కాని సుయోధనం పరీక్షకి రాకుండా. 'సుదర్శన చక్రం' అడ్డేయాల్సిన అవసరం మాత్రం కృష్ణారావుకి కలుగలేదు.

సుయోధనం కూడా అసలు వ్యాసుడు కాదనీ, చెక్కు మార్చుకోలేక, ఒక 'కవి మిత్రుడు' ఇచ్చిన దాన్ని ఇలా ఉపయోగించ దలిచాడు.పరీక్షలో తన 'బండారం' బయటపడి పోతుందనే భయంతో. ఎవరికీ చెప్పకుండా ఆ ముందు రోజు సాయంత్రమే. తన ఊరు బండి ఎక్కేసాడన్న సంగతి మాత్రం 'శకునికి' తప్ప ఎవరికీ తెలియకుండా అజ్ఞాతంగా ఉండిపోయింది.

రాకుండా. దారిలోనే అడ్డేసే ఏర్పాటు చేస్తాను సరేనా!" అన్నాడు కృష్ణ.

విజయ్ ఎగిరి గెంతేసాడు. "తెల్లారి మంది కొట్టుకు వస్తున్నామురా! ఈ సమస్య ఎలా పరిష్కారం అవుతుందో నని. క్షణంలో తేల్చేసావ్! పద! అలా వెళ్లి కాఫీ తాగి వద్దాం" అంటూ కృష్ణారావు చెయ్యి పట్టుకొని ఇంచుమించు పరుగులాంటి నడక సాగించాడు విజయ్.

* * *

ఇంకేముంది! పరీక్షార్థులలో ఒకరురాక పోవడంవల్ల విజయ్ కష్టపడి ఒక ఉభయ భాషా ప్రవీణుడి వద్ద కంఠతా పెట్టిన, 'సుభద్రా పరిణయ ఘట్టంలోని' పద్యాల దండాన్వయం వల్ల, మూడో క్లాసు పుస్తకంలోని. 'కుందేలు - తాబేలు' సెక్షన్‌లోని 'లా' వల్ల తాబేలు గెలిచింది.

పై కారణం తెలియని విజయ్ కృష్ణారావు లిద్దరూ ఇప్పటికీ ఆశ్చర్యపోతూ ఉంటారు, విషయం జ్ఞప్తికి వచ్చినప్పుతల్లా. *

శ్రీ గోపాలకృష్ణ రచన

# ప్రతిఫలం




"ఒరే సూరిగా! పంతులు రామశర్మ గార్ని ఒకసారి నే రమ్మన్నానని పిల్చుకురా! తొందరగా రా! దగ్గరుండి తీసుకురా!" కోర మీసాలను సాపు చేసుకుంటూ వాలు కుర్చీలో కూర్చుంటూ అన్నారు ప్రెసిడెంటుగారు.

"సిత్తం బాబూ! పంతులుగోరు సిన్న పొద్దెన్నం పట్నం యెల్లారు బాబూ!" చంకిలి కర్ర పెట్టుకొని. బుర్ర

గోక్కుంటూ విలబడుతూ సమాధాన మిచ్చాడు సూరిగాడు.

"అహా! అయినా వచ్చేసి వుంటారు రా! పట్నంలో రాత్రి వుండిపోవల్సిన పనులేవీ లేవే?"

"పిత్తం బాబూ!"

"నువ్వు పోయి ఒకసారి చూసిరా?" అన్నారు చుట్టను తీసి వెలిగిస్తూ.

"బాబు! యిటొక్కటి పారెయ్యండి" అంటూ చిన్న నవ్వు నవ్వాడు ప్రెసిడెంటుగారిచ్చిన చుట్టను ముట్టించుకుని. సూరిగాడు రామశర్మ గారింటికి వెళ్లాడు.

రామశర్మ ఎవరో రైతులతో మాటాడుతున్నారు. సూరిగాడు వెళ్ళి దండం పెట్టి "బాబూ! తమర్ని పెసిడెంటుగారు తీసుకు రమ్మన్నారు!" చెప్పాడు.

"నన్నా? ఎందుకో? యిప్పుడు తీరుబాటు లేదు. మధ్యాహ్నం వస్తానని చెప్పరా!"

"అది కాదు బాబూ! పెసిడెంటుగోరు యియ్యాల కమానెల్తారట! అందుకని.... మీతో ముక్కెవయిన యిషయం మాటాడాలట! దగ్గరుండి ఒక్కపాలి తీసుకు రమ్మన్నారు."

"అహా! అయితే వుండు. వస్తున్నాను!" బుష్ షర్టు వేసుకుని రామశర్మగారు బయలుదేరారు. సూరిగాడు వెనకాల నడుస్తున్నాడు.

"సూరిగా! ఏంటిరా నాతో మాట్లాడవల్సిన విషయం? ప్రెసిడెంటుగారు ఏం చేస్తున్నారు?"

"ఏమో బాబూ! నాకేటి తెలుసుద్ది? అరు పిలవమన్నారు. నేనొచ్చాను."

"పోనీలే!" అనేసి 'ప్రెసిడెంటుగారు నన్ను పిలుస్తున్నారంటే యేదో ప్రత్యేకత వుండక పోదు!' అనుకుని చిన్న నవ్వు నవ్వారు. యింతలో ప్రెసిడెంటుగా రిల్లు వచ్చింది.

"నమస్కారమండీ! పంతులుగారూ! యిలా దయచేయండి." ప్రతి నమస్కారము చేస్తూ ప్రెసిడెంటుగారు చూపించిన కుర్చీలో కూర్చున్నారు. సూరిగాడు గడప దగ్గర కూర్చుని. చుట్ట కొన కొరికి కాండ్రించి పక్కకి వుమ్మేడు.

ప్రెసిడెంటుగారు సూరిగాడికి ఏదో పని పురమాయించి అక్కడ్నించి పంపించేశారు.

"అఁ! పంతులుగారూ! నిన్న పట్నం వెళ్ళారుట! ఏమిటి పట్నం వార్తలు?

"అఁ! ఏముంటాయి? మా తమ్ముణ్ణి చూసి వద్దామని వెళ్ళాను."

"సమితి ప్రెసిడెంటుగారు వచ్చారా"

"ఆ భోగట్టా నేను చెయ్యలేదు. మన కిల్లీ బడ్డీ సత్యం చెప్పాడు యింకా రాలేదని! యివాళో రేపో వస్తారు!"

"అఁ! చూడండి. మీరు పెద్దవారు. చదువుకున్నవారు. మీకు నేను చెప్పాల్సిన దేముంటుంది...?" అంటూ ఒక్క పెట్టున నవ్వారు.

"అంటే ?" అయోమయంగా.

"అహా ఏమీ లేదు. ఈ కాలంలో నీతి. నిజాయితీకి స్థానం లేదు. యింతెందుకు ఒక్క అబద్ధమాడక పోబట్టి కదా హరిశ్చంద్రుడు అన్ని కష్టాలకు గురయాడు. అందుకని.....!" ప్రెసిడెంటుగారు అన్నారు.

"అందుకే ఆయన కీర్తి ఆచంద్ర తారార్కం పెర్చిపోయింది. చివరి కాల

# మీరు కష్టపడి సంపాదించుకొన్న సొమ్ముకు సరియైన విలువగల సైకిల్ కొనదలచుకున్నారా? హెర్క్యులిస్



ప్రతిపైసాకూడ మీరు కష్టపడి చెమటఊడ్చి సంపాదించుకున్నారు మీరు కూడబెట్టిన అమూల్యమైన సొమ్మును సరియైన విలువగల సైకిల్ మీద పెట్టాలి కదా?

హెర్క్యులిస్‌ను కొనండి దానికి మీరు ఆశించే అన్ని లక్షణాలువున్నాయి — బలిష్టత సాఫీగా పోవడము కచ్చితము వేగము మన్నిక

అది సహజమే

హెర్క్యులిస్ — ఆగ్నేయ ఆశియాలో అన్ని సౌకర్యాలు గల పెద్ద ఫ్యాక్టరీలో నిర్మించబడింది కలకాలం మీ జీవితమంతా మీకు సేవజేస్తుంది భారతదేశమందంతటా 3 000 000 మంది హెర్క్యులిస్‌నే విశ్వసించేవారిలాగే మీరు హెర్క్యులిస్‌ను విశ్వసించవచ్చు

**హెర్క్యులిస్ ఒక్క సైకిలేకాదు-మీ జీవిత కాలపు నేస్తము**

భారతదేశములో తయారుచేయువారు టి ఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా అంబత్తూరు మద్రాసు-53

ప్రొప్రైటర్లు ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ అనుమతిని పొందినవారు

* రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్కు -

ది హెర్క్యులిస్ సైకిల్స్ & మోటార్ కో లిమిటెడ్ యుకె వారిది







TIC-H 5423

ణంలో మహోజ్వల దర్శనం లభించింది. చరిత్రలో వారి గాథ సువర్ణాక్షరాలతో లిఖించబడింది. వాళ్లు దైవసమానులు. నేటి మానవులంతా హరిశ్చంద్రుని ఆదర్శంగా తీసుకుని సత్యసంకల్పంపరణ చేసిన నాడు లోకంలో అరాచకాలు వాటంతటవే అరికట్ట బడ్తాయి.''

''అయినా చూడండి; పై ఆఫీసరు నుంచి ప్యూన్ వరకూ. చివరికి కూలీ సర్కారు లంచం తీసుకోనివాళ్లు లేరు. నిజాయితీగా బ్రతకటానికి రోజులు కావు; . .''

''యిచ్చేవాళ్ళుంటే పుచ్చుకొనే వాళ్లుంటారు. మనం యివ్వడం మానేయడమే''

''మానేస్తే మన పనులు త్వరగా జరగవు. కాబట్టి;...''

''ఊ! కాబట్టి...?'' అర్ధోక్తిలో సూటిగా.

''అహ ఏమీ లేదు అందుకని ఏదో కొంచెం వాళ్ళకి పారేసి మనం కొంచెం వెనక వేసుకోవాలి. ధరలు చూస్తే తారామండలాన్నది గమిస్తున్నాయి. వాటి ధాటికి మనం తట్టుకుని మన నిత్యావసరాలు వెళ్ళబుచ్చుకోవాలంటే కొంత పైకం వెనకేసుకోవాలి నాలుగు పైసాలు ఆ గుమస్తా ముఖాన పారేస్తే మనపనులు చక చక చేసేస్తారు. అయినా వచ్చేది తక్కువయినా చాకిరి యెక్కువ ఆ గుమస్తాలకి. మనమిచ్చే డబ్బులు లేకపోతే వాళ్ళెలా బ్రతకగలరు!'' చుట్ట పొగను లావుగా లాగి వదిలారు. ఆ పొగ రామశర్మ ముఖం మీదికి వచ్చింది.

చేత్తో పొగ నెట్టుతూ ''అసలు చెప్ప వల్సిన విషయం సూటిగా చెప్పండి. యీ అనవసరమైన ఉపోద్ఘాత మంతా దేనికి? అనవసరం.'' చిరాగ్గా.

''ఆహ! ఏమీ లేదు. సమానవియ్యం సమాన కయ్యం అన్నారు. ఆ కూలి రైతులు మీకు పైసా కూడా యివ్వలేదు. అందుకని యిదిగో యిది తీసుకుని నా మీద యింటి పన్నులు అక్రమంగా వసూలు చేసినందుకు కేసు రాజీ చేసెయ్యండి!'' నోట్లకట్ట అందిచ్చారు.

రామశర్మగారికి పళ్ళు మంటలు పట్టుకున్నాయి. కోపం తారా స్థాయి నందుకుంది. కళ్ళు కెంపులయ్యాయి.

''ప్రెసిడెంటుగారూ! యెందుకానన్ను పిలిపించింది? చాలా మంచిది. వచ్చేది తక్కువని అమాయకమైన ప్రజ మీద పడతారా? కాకులను కొట్టి గెద్దకు వేస్తారా? పూటకి తిండిలేక, కట్ట బట్ట రెక్కాడితేకాని డొక్కాడని నిరుపేదపైనా మీ అక్రమమైన దాడి? వా అక్రమంగా, అన్యాయంగా, పన్ను కుద్దేది? వారు కట్టలేమని కాళ్ళా వేళా పడి వేడుకున్నా దయాదాక్షిణ్యాలు లేక కేవలం నరరూప రాక్షసుల్లా పీడిస్తారా? గ్రామ పెద్దలు మీరు. ఏ ప్రజల ద్వారా యీ పదవికి యెన్నికయ్యారో ఆ ప్రజలకే అన్యాయం తలపెడ్తారా? అలా వెళ్ళి ఒకసారి చూడండి. ఎంతమంది జనం తిండిలేక అలమటిస్తున్నారో! యింత మంది ప్రజలు తిండిలేక బాధ పడుతుంటే మీరు చేసే వుపకారం యిదేనా?'' రామశర్మ ఆవేశంతో వూగిపోతున్నాడు.

''పంతులుగారూ! తమరు కూర్చోండి నా మాట వినరుకదా సరిగ్గా.'' చెయ్యి

వచ్చుకుని కూర్చోపెట్టారు ప్రెసిడెంటు గారు

"చూడండి! పదవిలో వున్నప్పుడు ఆమాత్రం చెయ్యక మానం. వాళ్ళకై గదా మొన్న చెరువుకి నాలుగు ప్రక్కల కళింగాలు కట్టించింది! వాళ్ళకై గదా మొన్న అయిదు వందల రూపాయలు పైగా ఖర్చుచేసి కోటా తెచ్చింది. వాళ్ళ సౌకర్యం కోసమేగదా ప్రత్యేకంగా పంచాయతీ ఆఫీసు కట్టించి. రేడియో నలుగురికి వినబడేట్లు వీలైన ప్రదేశంలో పెట్టాము"

"ప్రెసిడెంటుగారూ! వాళ్ళకి కావల్సింది కళింగాలు; రేడియోలు. పంచాయతీ ఆఫీసులు కావు! వాళ్ళకి కావల్సింది ...కి! తిండి!! వాళ్ళ కడుపు నింపేది ...ని యివన్నీ కావు. యికనైనా ...పి ఆ డబ్బు వాళ్ళ కిచ్చెయ్యండి. ...స్తే తప్పకుండా కేసును వుప...ంచటానికి తగు యేర్పాట్లు నే...ు" గట్టిగా లేచాడు రామశర్మ.

'యిదిగో పంతులుగారూ! నే చెప్పిన ...టలు చెవికెక్కలేదు. హాఁ! నేనూ చూస్తాను. యీ బెదిరింపులకు లొంగే మనిషిని కాను నేను. పట్నం వెళ్ళి కేసు కొట్టించకపోతే నా పేరు భుజంగరావు గాదు! కాని నా మాటలు పెడ చెవిని పెట్టి మీ యిష్టానుసారం ప్రవర్తించినందుకు ప్రతిఫలం మీరు అనుభవించకపోరు!ఆఖరి సారిగా చెబుతున్నాను."

"హాఁ! డబ్బుతో కొనలేనిదేదీ లేదని విర్రవీగే మీకు కన్ను తెరిపించే రోజు వస్తుందని మర్చిపోకండి! అంతమంది ప్రజల ఆర్తనాదాలు మీకు జయం కల్గించ లేదు. స్వార్థపీడితులైన మీకు తగినశాస్తి జరగక మానదు. పాలాషు డబ్బుపడినా వా విర్ణయానికి తిరుగు లేదు! మార్పు లేదు!! యిమ్మాటికీ మారదు!!!" లేచి చర చరా వెళ్ళిపోయారు రామశర్మగారు.

రామశర్మగారు పోయిన దిక్కుగా చూసి, నోట్లకట్ట జేబులో పెట్టుకుని లోనికి వెళ్ళిపోయారు ప్రెసిడెంటు భుజంగరావు గారు గర్వంగా నవ్వుకుంటూ.

## 2

"శరభంగారూ! ఏమిటీ అన్యాయం? ఏమిటీ దారుణం! ఆ దిక్కులేని వారి పైనా మీ కార్య శూరత చూపిస్తారు?" తీవ్రంగా అన్నారు రామశర్మగారు.

"యిదిగో పంతులుగారూ! అసలు మీ రనేదేమిటి?" కళ్ళజోడు తీసి తుడుస్తూ ఏమీ తెలియని అమాయకుడిలా అన్నాడు శరభంగారు.

"మీరు చేస్తున్న పని మంచిది కాదు. అవినీతి, అన్యాయం, అక్రమంతో గడించిన డబ్బు శాశ్వతంగా నిలవదు!"

"అయితే ఏమిటంటావ్? "

"ఏమీ లేదు. గవర్నమెంటు మెమో రాండం ప్రకారం బంజరు భూములనన్నిరు పేదలయిన ప్రజానీకానికి పంచిపెట్టక ధన వంతుల పరం చేస్తున్నారని తెలిసింది. పైగా వాళ్ళు వచ్చి బ్రతిమలాడినా నిష్కర్షగా, నిర్మొహమాటంగా, వారిని తగిలి వేసారుట! పైసా లేనిదే కలం పడదన్నారుట!" ఆవేశంగా.

"శర్మగారూ!, ఆవేశపడుతున్నారు. యీ రోజుల్లో డబ్బు లేకుండా ఎవరూ పని చెయ్యరు. చెయ్యలేరు. 'ధనం మూల మిదమ్ జగత్'న్నారు."




"అందుకని పేదలపైనా మీ అస్త్ర ప్రయోగం! యీ విషయంలో మీ నిర్ణయము మార్చుకుని వారి కాదరువులను కల్పించి వారి కడుపును నింపండి."

"యీ విషయంలో మీ జోక్యం అనవసరం! పరాధికారం పైన వేసుకుంటున్నారు!"

"లేదు. అవసరమయే జోక్యం కల్పించుకున్నాను దిక్కులేని, నిరాధారమైన పీడిత ప్రజానీకానికి మీరంతా కల్పి తలపెడుతున్న ద్రోహం చూసి నా రక్తం కుతకుతలాడుతోంది. అందుకే కల్పించుకుంటున్నాను."

"ఇదిగో నే చెప్పిన మాట వినండి. వాళ్ళు వొట్టి చవటలు. వాళ్ళని పట్టుకుంటే మనకి వచ్చేది సున్న. దీపం వుండగానే చక్కబెట్టుకోమన్నారు." అంటూ చుట్ట వెలిగించారు.

"అయితే యీ విషయంలో మీ
నిర్ణయం మారదా!"

"మారదు. నా నిశ్చయం మారదు!"

"కరణంగారూ! విపరీత పరిణామాలకు
మీ నిర్ణయం దారి తీస్తుందని గట్టిగా చెబు
తున్నాను. పరిస్థితి విషమించిన పిదపయేం
చేసినా, చేయదల్చినా, చేతులు కాలిన
పిదప ఆకులు పట్టుకున్నట్లే! మీదా పెద్ద
కుటుంబం! యీ విషయంలో తుదివరకూ
పోరాడి వారికి న్యాయం చేకూరుస్తాను."

"ఓహో! యీ బెదిరింపులకు లొంగి
పోవల్సినవాడు కాదోయ్ యీ కరణం
పాపయ్య! నీలాంటి వాళ్ళని వందమందిని
చూశాను మొన్న మొన్న పుట్టిన నువ్వు
బోయ్ నన్ను బెదిరించేది!"

"యివి బెదిరింపులు కావు. నిజాలు.
జరగబోయే నిజాలు! ధనమనే అం
కారపు తెర కళ్ళకు తగిలించబడింది

అందుకే నా మాటలు మీకు రుచించవు. నరే మీరే అనుభవిస్తారు.'' శర్మగారు కోపంగా గుమ్మం దిగి వెళ్ళిపోయారు.

కరణంగారు గర్వంగా నవ్వుతూ. కోర మీసాలను మెలేసారు, 'యీ కరణం పాపయ్యను యెదిరించడం బ్రహ్మతరం కాదని యీ కుర్ర కుంకకేం తెల్సు! త్వర లోనే తెలియగలదని' స్వగతంగా అను కుని తన పనిలో లీనమయ్యారు.

## 3

త్రేతాయుగంలో మానవులను చంపి తినే రాక్షసు లుండేవారు. వారిని చక్ర వర్తులు నిర్జించి శాంతిని నెలకొల్పేవారు. అలాగే నేటి కలియుగంలో డబ్బుకై మానవులను పీడించుకు తినే నరరూప రాక్షసులు లేకపోలేదు.

కాయ బాగా పండితేగాని రాలదు. అలాగే పాపం పూర్తిగా పండాలి. అవి నీతి. అక్రమాలు ఎల్లకాలం ఒక్కలాగే అచ్చిరావు. కాలానుక్రమంగా 'రాజే కింకరుడుగా' మారకపోడు. అన్యాయం ఒక నాటికయినా బయట పడి న్యాయంచే పరాజయం పొందక పోదు!

రామశర్మ కృషి ఫలించింది.

ప్రెసిడెంటుభుజంగరావుపై వి.కరణం పాపయ్యగారిపైన వారు చేసిన దుర న్యాయాలకు సాక్ష్యాలను సేకరించి కేసు ఫైల్ చేసాడు. ఎంక్వయిరీ జరిగింది.

నేర నిరూపణ జరిగిపోయింది. తత్ఫ లితంగా ప్రెసిడెంటుగార్ని పదవి నుండి తొలగిస్తూ 1200 రూపాయలు జుల్మానా కట్టమని. కరణంగార్ని పదవి నుండి తొలగిస్తూ 1000 రూపాయలు జరీమానా కట్టమని కోర్టునాడు తీర్పు యిచ్చారు.

పట్నంలో రామశర్మకున్న పలుకుబడికి కార్యదక్షత కూలిజనానికి రామశర్మ దేవుడే అయ్యాడు.

యీ విషయం జరిగిన తర్వాత రామ శర్మ పంచాయతీ ప్రెసిడెంటు గార్కి. కరణంగార్కి.

## 4

'యిదిగో భుజంగరావు! యీ రామ శర్మ యెంత పని చేశాడు. వీడి పీడ ఎలాగయినా వదిలించుకోవాలి!'' మెల్లగా అన్నారు కరణంగారు.

''అవునండీ! మనపై కక్ష బూని యీ విధంగా చేసినందుకు నాకు అహో రాత్రులు నిద్ర పట్టడం లేదంటేనమ్మండీ ప్రతీకార వాంఛ నన్ను దహించివేస్తోంది. యీ ఘోరావమానం భరించి నలుగురి లోనూ తలెత్తుకు తిరగలేక చస్తున్నా నంటే నమ్మండి. బంధువులవద్ద తల వంపులు!''

''అవునూ! నాకూ అలానే వుంది. వీడిని ఎట్లా అయినా పడగొట్టి పుట్ట గతులు లేకుండా చేసి; యీ గ్రామానికి మకుటం లేని మహారాజులమనిపించు కోవాలి. మన మాటకు తిరుగుండకూడదు.

''అవును. అందుకని చక్కని. చిక్కని ప్లాను వెయ్యాలి. బాగా ఆలో చించండి. మీకే తెలియాలి మరి!''

కాసేపుఆలోచించసాగారు యిద్దరూ.

''ఆ! జ్ఞాపక మొచ్చింది! దీనికి మరి తిరుగు లేదు.'' అంటూ పాపయ్య గారెంతో సంబరపడిపోయి ఏదో చెవిలో చెప్పారు భుజంగరావుకి.

భుజంగరావు కరణంగారి ప్లానుకి చాలా పొంగిపొయ్యారు.

"ఆఁ! బాగుందోయ్ కరణంగారూ! కాని యిదెప్పుడు చేస్తాం? దీనికి యెవరు సమర్థులు?" ప్రశ్నార్థకంగా కరణం కళ్ళల్లోకి చూశారు.

"దీనికే ముంది; మన సూరిగాడు లేడూ! వాడికి కొంచెం మందు పడేస్తే అవలీలగా ఎడం చేత్తో చేసి పారేస్తాడు"

"అహాఁ! బాగుంది, యిక యెప్పుడు చేస్తాం?' అన్నదే ఒక చిక్కు ప్రశ్న లాగుందే?"

"ఆ! రామశర్మ మధ్యాహ్నం పట్నం వెళ్ళాడు. రేపు సాయంకాలానికల్లా వస్తానని యెవరితోనో చెపుతుండగా నా చెవిన బడింది! అందుకని మన పూరపతల ఈత తోపులున్నాయి చూశారూ! అక్కడ మనవాళ్ళని వుంచుదాం వస్తే అదే తోవన రావాలి గదా! అప్పుడు వాడి పని పడదాం!"

"సర్లెండి అలాగే చేద్దాం మీరు వెళ్ళండి నేను మన సూరిగాడ్ని పిలిపించి కాస్త మందు పడేస్తాను"

గర్వంగా యిద్దరూ నవ్వుకున్నారు. రామశర్మ పీడ విరగడవుతుందని!

## 5

"ఏరా శేఖర్, ఏంటి అలా ఆముదం తాగినట్టుగా ముఖం పెట్టావ్?" భుజంపై చెయ్యి వేస్తూ అన్నాడు రామం.

"అబ్బే ఏమీ లేదు."

"అవునురా నేనొకటి అడుగుతాను చెబుతావురా?"

"అడగరా సందేహం యెందుకు?"

"మీ నాన్నగార్ని కరణం వుద్యోగం మంచి తీసేసారుట ఏం జరిగింది?"

"అఁ! వాడెవడో రామశర్మట! నీతి నియమ పరుడట. మా నాన్న బ్రైబ్ తీసుకున్నట్టు లేని సాక్ష్యాలు సేకరించి కేసు పెట్టాడుట. పై ఆఫీసర్లకి మస్తుగా తడిపాడు! వాళ్ళచే కేసు ప్రూఫ్ చేయించాడు. వాడి పని పట్టకుండా వూరుకుంటారా?"

"అయితే మీ నాన్న బ్రైబ్ తీసుకోలేదని నీకు తెలుసా?" సూటిగా ప్రశ్నించాడు రామం

శేఖర్ యిరకాటంలో పడ్డాడు "ఎలా తీసుకోదని చెప్పేది! తన కళ్ళెదుటే యెంత మంది వద్దో తీసుకున్నారు!' అయినా తమాయించుకుని "తీసుకోడు? ఆ మాత్రం ఏదో చిక్కినపుడు తీసుకోక మానేవాడెవడు చెప్పు?"

"కొంచెం తీసుకున్నా, పెద్ద మొత్తం తీసుకున్నా లంచం లంచమే! అందుకే వాడలాగ చేశాడు."

"వీడు తీసుకోవటం మానేశాడా? లోకంలో ఎవరూ డబ్బు తీసుకోవటంలా పని చెయ్యటానికి! పెధవది ఎమ్. ఓ తెచ్చే దన్నరుకు కూడా లంచం! రోజూ వుత్తరాలు తెచ్చే బంట్రోతుకి లంచం! కాలు కదిపితే లంచం! పెన్ను కదలాలంటే లంచం! లంచం తీసుకోని సత్యవంతుడీ కలియుగంలో ఎవడు వున్నాడో చెప్పు చూద్దాం!" కాస్త సీరియస్‌గా.

"యిదిగో శేఖర్! ఆ విషయం అటు విడిచిపెట్టు మన విషయాల్లోకి వద్దాం!" అంటూ రామం టాపిక్ మార్చాడు.

"ఆఁ? ఎగ్జామినేషన్ ఫీజు కట్టేసావా?"

"లేదురా!"

"అం! లేదా! యెల్లుండే లాస్ట్ డే!"

'అందుకేరా చికాకుగా వుంది. నాన్న నిన్నటికే డబ్బు పంపిస్తా నన్నారు. పంపించలేదు యింకా!"

'మరైతే యేం చేస్తావ్ ?"

"అదే నేమా ఆలోచిస్తున్నాను." కొంచెం సేపాలోచించి "అం! యివాళ్ళ కూడ చూస్తాను! డబ్బు రాకపోతే రేపు సాయంత్రం కాలేజీ విడిచిపెట్టిన తర్వాత సైకిల్‌పై యింటికి వెళ్ళి డబ్బు పట్టు కొస్తాను. హోటల్ వాడిక్కూడా పే చెయ్యాలి!"

# 6

ఐహాళ అమావాస్య! కాదు చీకటి!

మదుపు లేకుండా డబ్బు సంపాయించే వారికి కుడిభుజం! కక్షలు కార్పణ్యాలు తీర్చుకోవటానికి దోహదకారి! భర్తలను విదురపుచ్చి పరప్రియులతో కులికే కాంత లకు....! సాయంకాలం 8 గం॥లకే అంధకారం వలుమూలలా వ్యాపించింది!

సూరిగాడు, మరి ముగ్గురు కలిసి బండి కర్రలు పట్టుకుని యమభటుల్లా బయ ల్దేరారు ఊత తోపుల వద్దకు! దారిలో గవర్నమెంటు సారా దుకాణం దగ్గిర ఆగి ఒక్కొక్కరే ఒక్కొక్క అయిదు రూపాయల సారా పట్టించారు!

తీవిగా మీసాలు త్రిప్పుకుంటూ బడి తలు భుజాన వేసుకుని యూత తోపులు సమీపించారు. ఇటు యిద్దరు, అటుప్రక్క యిద్దరూ కాసుకుని కూచున్నారు. పొంచి వాగున్నారు!

"హుం! మానవులు. సాటి మానవుడి ప్రాణాలు తీయటానికి ఏ మాత్రం వెను దీయని నరరూప రాక్షసులు! డబ్బుకై యేదైనా చేయటానికి సిద్ధపడే నైతిక పతనానికి దిగజారి పోతున్నారు!"

సమయం రాత్రి 8 గంటలు!

నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ చింతగీరులు రొద చేస్తున్నాయి!

ఇంతలో సైకిల్ బెల్!

వంగుని చూశాడు సూరిగాడు!

వేగంగా, శక్తికొలది పెడల్ వేస్తూ అదరాబాదరాగా వస్తున్నాడు ఒక వ్యక్తి.

చీకటి వలన దారిలో ఎవరూ కన పడటం లేరని బెల్ మ్రోగించుకుంటూ శరవేగంతో వస్తున్నాడు.

సూరిగాడు బెల్ శబ్దం మళ్ళీ విన్నాడు.

"అదిగో? శర్మగోరు! వస్తున్నారు. ఊం' రడీ!" అని అందరికి చెప్పినట్లు సైగ చేశాడు.

బడితలు పట్టుకుని సిద్ధంగా వున్నారు. కొంచెం వంగి చూశారు.

"సందేహం లేదు! శర్మగోరే! ఊం! కానియ్యండి!"

సైకిల్ యూత తోపులు దాటి యివల కొచ్చింది.

సూరిగాడు ఐదేలు మని బడిత(కర్ర)తో బలంగా, సత్తువ పూనికగా బుర్రపై కొట్టాడు!

"అమ్మో" గట్టిగా అరుపు.

కాని మత్తులో వున్న వారికా కేకలు వినిపించలేదు.

ఐదఐద మని నలుగురూ బడితలకు పని కల్పించారు. పాపం ఆ వ్యక్తి ఆర్త నాదాలు పాషాణ హృదయులైన వారిని కదిలించలేక పోయాయి!

బుర్ర బ్రద్దలై పోయింది! చివరి సారిగా ఒక్క గావుకేకతో ప్రాణాలు







విడచి. నేల కారిగిపోయాడు.

సూరిగాడు జేబులో వున్న కాగితాలు పైకిల్ పట్టుకున్నాడు. ఒకడు ఆ శవాన్ని యీత దొంకల్లోకి తూరేశాడు ఎవరికీ కనిపించకుండా! అంతే. ప్రక్కన వున్న చేలో చేతులు కడిగేసుకుని. త్వరత్వరగా పెద్ద పెద్ద అంగలతో యింటికి వచ్చేసి చేసిన ఎనంతా పూస గుచ్చినట్లు చెప్పేశారు. కరణం పాపయ్యగారు. ప్రెసిడెంటు భుజంగరావుగారు పండు పర్వదినంలా పొంగిపోయారు శర్మగారి పీడ వదిలిందని!

"అవున్రా సూరిగా! ఆయన జేబు లన్నీ చూశావురా? ఏమైనా మనకి పనికి వచ్చే కాగితాలున్నాయేమో!" కరణం గారు సూరిగాడి నడిగారు!

"ఆఁ! యీ సూరిగాడంటే అంత యిదఁవ మాలినవాడనుకున్నారా! అమాతరం తెల్దా!" అంటూ తువ్వాలు గుడ్డకి కట్టిన కాగితాలు. చిన్న సైజు (డైరీ) పుస్తకం యిచ్చాడు గర్వంగా.

కళ్ళజోడు పెట్టుకుని దీపం దగ్గరగా వెళ్ళి పుస్తకం చూడటానికై మొదటి పేజీ తిరగేశారు. తన కళ్ళను తనే నమ్మలేక పోయారు.

"బాబూ! . బాబూ! " పెద్దగావు కేకలతో పడిపోయారు పాపయ్యగారు.

"బాబూ! ...ఎంత దారుణం జరిగిపోయింది. ఏ చేతులతో పెంచి పెద్ద చేసినో ఆ చేతులతోనే ...విన్ను....! బాబూ! నేను చేసిన స్వార్థపూరిత కార్యాలకు. అన్యాయాలకు నువ్వు బలి అయిపోయావా? బాబూ... !? నీవు లేని నిముషమయినా నే బ్రతకలేను!' అంటూ దారుణంగా కూలబడిపోయారు.

తెల్లబోయి చూస్తున్నారు భుజంగరావుగారు. సూరిగాడు తదితరులు! •

# పనికిరాని పరిజ్ఞానం

మానవుని శరీరంలో 206 ఎముకలున్నాయి.

• • •

ఇండియాలోని జాక్రా డామ్ ప్రపంచంలోని డామ్‌లలోకెల్లా ఎత్తైనది. దీని ఎత్తు 740 అడుగులు.

• • •

ఆక్సిజన్ వాయువును 1774లో ప్రీస్ట్లీ తయారు చేసాడు.

• • •

ప్రపంచంలోకెల్లా అతి చిన్న సైజు పత్రిక బెంగాల్‌నుండి వెలువడుతుంది. దీని పేరు పత్రాణి మూడున్నర అంగుళాల పొడవు. రెండున్నర అంగుళాల వెడల్పు ఉంటుంది. అందులో కథలు, కవితలు, ప్రముఖుల రచనలుంటాయి.

• • •

భూ విస్తీర్ణం 19,62 50 000 చదరపు మైళ్ళు.

• • •

ప్రపంచమంతటికి అత్యుత్తమమైనది ఎవరెస్టు శిఖరం. దీని ఎత్తు 29,040 అడుగులు.

• • •

కుట్టు మిషన్‌ను 1864లో ఇలియస్‌హోవ్ తయారుచేశాడు.

• • •

మన జాతీయగీతం పేరు జనగణమణ. జపాన్ జాతీయగీతం పేరు కిమిట్ గయో. స్వీడిన్ జాతీయగీతం పేరు సాంగ్ ఆఫ్ ది నార్త్. రష్యన్ జాతీయ గీతం పేరు హిమ్న్ ఆఫ్ ది సోవియట్ యూనియన్. ఫ్రాన్స్ జాతీయగీతం పేరు లా మార్సెయిల్స్ కెనడా జాతీయ గీతం పేరు దిమే పుల్ లీఫ్ ఫర ఎవర్. గ్రీసు జాతీయగీతం పేరు హెయిల్ డీ హెయిల్ లిబర్టీ. ఇంగ్లడ్ జాతీయగీతం పేరు గాడ్ సేవ్ ది క్వీన్ సింగపూర్ జాతీయగీతం పేరు మజులర్ సింగపూర్. అమెరికన్ జాతీయగీతం పేరు ది స్టార్ స్పాంగిల్డ్ బానర్.

• • •

సేకరణ—యస్. గోవిందరాజ్.

# రాక్షసీ, నీ పేరు రాజకీయమా? వర్ధిల్లు!

(గతసంచిక తరువాయి)

11

రాజకీయాలలో చిరంజీవి అ ఆలు నేర్చుకోడం పూర్తి చేశాడు; అందు చేత వల తలల్లో ప్రవేశించాడు

దీనికి తగ్గట్టు తను 'అఖిలభారత యూత్ పార్టీలో సభ్యుడుగా నమోదు కాబడ్డాడు ఈ యూత్ పార్టీ మహాసభల్ని అర్జంటుగా మైసూర్‌లో ఏర్పాటు చేయడం వల్ల చిరంజీవి రొమ్ము విరుచుకుని చేత కొంత రొక్కంతో మనిషంతా దర్పంతో మైసూరు వెళ్ళిపోయాడు

ఈ పార్టీ సభ్యుల్లో ఎక్కువగా విద్యార్థులే వుంటారు అయితే వాళ్ళకి విద్య పట్ల అంత అమోఘమైన అభిప్రాయం వుండదు తాతలూ తండ్రులూ సంపాదించి పెట్టిన డబ్బు వాళ్ళనలా తయారు చేసింది ఈ తరహా ఉత్సాహవంతులయిన విద్యార్థులనూ ఆ తరహా కార్యక్రమాలకు ఆకర్షితులను చేయడానికి మాత్రం కొందరు వృద్ధనాయకులు కంకణం కట్టుకున్నారు; ఈ వృద్ధ నాయకులే యూత్ పార్టీ పెద్దలూ కార్యకర్తలూను

చదువుకుని బాగుపడదామనే సదుద్దేశం చేరీచేరడంతోనే చచ్చిపోతుంది సంవత్సరం పొడుగునా సభలూ అక్కడి తీర్మానాలూ వాటి ఆచరణలూ వగయిరా వారి వత్తిడి పనుల్లో నెత్తెక్కి తిరిగే విద్యార్థికి చదివేందుకుగానీ పరీక్షలకెళ్ళేందుకు గానీ తీరుబడి ఎక్కడిది?

చదువు ద్వారా దేశానికి ఉపయోగపడటం కంటే ఈ సభా తనరతులు అనుభవంతో దేశాన్ని ఉద్ధరించి పుణ్యం కట్టుకోడమే తక్షణ కర్తవ్యమంటూ ఈ వృద్ధనాయకులు ఉపన్యాసాల్తో మత్తుమందు సరఫరా చేస్తున్నంత కాలమూ ఈ యువ సభ్యులు చదవరు పరీక్షల కెళ్ళరు

అందుచేత చిరంజీవికి పరీక్షల మీద ఆసక్తి పూర్తిగా చచ్చిపోయి మైసూరు వెళ్ళి నాయక శిఖామణులను కలుసుకుని వాళ్ళ ఆశీస్సులను పొందాలనే కోరిక ఎక్కువయ్యింది

• ఉపనిషత్ •

పెళ్ళిముందు తండ్రికి చెప్పి వెళదామనుకున్నాడేగాని. ఆ తండ్రి మహాశయుడు ఎక్కడున్నాడో ఎంత ప్రయత్నించినా తెలిసింది కాదు.

అందర్నీ అడిగేడు-నాన్నెక్కడని?

ఎవరూ తెలీదన్నారు.

నాలుగు రోజులు గడిచినా తండ్రెక్కడున్నాడో తెలీలేదు. అవతల సభ రోజు దగ్గిర పడుతోంది. సభల కెళ్లేముందు తండ్రినుంచి సలహా పుచ్చుకోడం అవసరం.

పైగా-

సుమతి విషయం ఎలు తేల్చింధీ చెప్పలేదు. కథ విని వూరుకున్నాడేగాని. తను తను ఏమనుకున్నదీ చెప్పలేదు. ఏ విషయమూ వివరించకుండా తండ్రి ఎక్కడికి పారిపోయినట్టు?

'కొంపదీసి నాన్న మంచివాడు కాలేదు గదా?'

'ఒరేయ్ జీసీ! నువ్వు సుమతికి అన్యాయం చేశావు కొడకా! నువ్వు ఆ పిల్లని పెళ్ళి చేసుకోవడం న్యాయం నాయనా! అది కాకపో తండ్రీ. నా ఆస్తిలో, ఇన్ని లక్షల పిసుకల్లో ఏ ఒక్క పిసుకా నీకు చిక్కనివ్వను పుత్రా! నా మొత్తం ఆస్తినీ ఏ స్వాములవారికో రాసేసి నేను కృష్ణా రామా అనుకుంటూ కాలం గడిపేస్తాను తెలుసా! జాగ్రత! అని అనేస్తే—

అంటే ఏముందీ. నేను మొత్తం గోవిందః లక్షలాస్తిని వదులుకొని తనేమి చేయగలడు?

పిచ్చిగానీ.ఇంత నీతివంతమైన బతుకెక్కడేడ్చిందీ యింట్లో. పక్కనే బతికే వాడిని ఛీట్ చేయడంలో గల 'రుచి' వాడిని ఉద్ధరించడంలో వుంటుందా! వుండదుండదు. ఆయనంత ఫూలా! కాదు కాదు.

'మరి నాన్నెక్కడ?'

ఏదో రాజకీయ వంచారంలో వుండి వుంటాడు. ఎవడి కొంపో ముంచే నిమిత్తం రాజధాని కెళ్ళి వుంటాడు. అవునదే కరెక్టు!

నగరస్థాయినుంచి. రాష్ట్రస్థాయిలో పాలకుడవ్వాలనే దిక్కుమాలిన కోరిక నాన్నని పరుగులెత్తిస్తుందేమో! అందుకే నాన్న రాజధాని కెళ్లి వుంటాడు.

నిజానికి ఈ రాజకీయమే నాన్నని లొంగదీసుకుని వుండకపోతే. తన బతుకు దారుణమే గదా!

'రాజకీయమా! నీ దుంప తెగిపోను. వర్ధిల్లు! మూడు కాయలు ఆరు పూలుగా వర్ధిల్లవే ముండ! నాన్ననీ నన్నూ ఉద్ధరించు. నీ కడుపు చల్లగా-మాలో మాకు కలతలు పెట్టకు నాకింకా లెక్కలివ్వలేదు నువ్వు. మనూ. ఇవతిలేమొ. నాన్నకి లక్షలిచ్చేసేవ్. ఇంత చేసి. నువ్వు ఇప్పుడు నాన్నని వదిలేస్తే-నాన్న లక్షలు గాలి కెగిరిపోతాయే తప్పించి నా వళ్లో పడవు. నువ్వు చల్లగా చూస్తే నాన్నలాగా నేనూ ఎదుగుతాను. ఎదిగెదిగి నాన్నని మించి నాన్నకి అందకుండ పోతాను! నా లక్ష్యసిద్ధికి అడ్డంపడి పాపం కట్టుకోవద్దు. నా రెక్కల్ని నాకు తొరగా యివ్వు. నిజమే మనసుపడి సుమతిని చెడగొట్టేను. చెడగొట్టడమే రాజకీయం గదా. అందు చేత నన్ను పరీక్ష చేయకు. నాన్నకి మంత్రి

మాన కలిగించు. ఆటువేవు లాక్కుపో. బతుల మీద ఆయనకి మరింత మక్కువ కలిగించు. నాన్నని ఆ విధంగా నువ్వు బంధించి వుంచేస్తే ఇవతల నా పనులన్నీ చక్కబరుచుకుంటాను. నాన్నని నువ్వు వదిలేస్తే—నాన్న కళ్ళు తెరుస్తాడు. నాన్న కళ్ళు తెరుస్తే రాజకీయమా! గాకు రెక్కలు రావు. నేనెదగలేను. సింహాసనం వుండదు. లక్షలు నన్ను చేరవు కాపాడు. కాపాడి, కాపాడి, కాపాడు. అనుకున్నాడు చిరంజీవి.

ఇంతనుకున్న మీదట, తండ్రికి చెప్పకుండానే అతను మైసూరు రైలెక్కాడు—

• • •

రామదాసు సీత ముందు మౌనంగా కూర్చున్నారు!

సీత గబగబా మాటాడుకుపోతోంది. ఆ విధంగా ఆమె ఎప్పట్నుంచో మాటాడుతూనే వుంది.

రామదాసుని చూచిన మొదటి క్షణం గొయ్యిబొమ్మ. ఆ క్షణం నుంచి జారు పది రుద్రకాళియై, వెనువెంటనే భూవే ఏయై ఆ పిదప మామూలు సీతగా మారి మాటాడుతూనే వుంది.

ఇన్నేళ్ళ నరకంలో తనే స్వర్గాన్ని నమ్ముకు బతికిందో, ఇన్నేళ్ళ ఒంటరి తనంలో తనే తోడు నాశించి ముదుస్తుందో అన్నీ, అంతా వివరంగా చెప్పింది.

కన్నీ రెట్టుకుంది. గాద్గదికంగా మాటాడింది. ఆత్మస్థైర్యం మనిషిని కుదువగా కాలా ధైర్యంగా తన కథని చెప్పింది.

తలెత్తి సూటిగా ప్రశ్నించింది. వ్యంగ్యం పలికింది. కన్నెర్ర చేసింది. జాలిపడి నవ్వింది. రామదాసు బతికే బతుకుని తిట్టే ప్రయత్నం కసి. చాతగాక తన బతుకుని తానే తిట్టుకుంది.. తనని తాను తిట్టుకున్నందుకు బాధ పడింది.

ఆ తర్వాత, తాను సాధించిన కొన్ని ఘనకార్యాలూ తాను కలలు గంటూన్న బతుకూ ధైర్యం ఆధారంతో—ఆవేశంగా చదివి వినిపించి తృప్తి పడింది.

అంతలోనే మళ్ళా ఏడ్చింది.

ఒక్క గంటకాలంలో యిన్ని మార్పుల మధ్య అంత చరిత్ర విన్న రామదాసు అతి దీనంగా అన్నాడు.

"నన్ను క్షమించు సీతా! దుర్మార్గుడ్ని నేను, ఇంత కథని దాచుకు బతుకుతూన్న నువ్వు దేవతవి! క్షమించు నన్ను!"

సీత మాటాడ్డం లేదు. ఆలోచిస్తోంది. ఇది నిజంగా పశ్చాత్తాపమే అయితే, ఈ పశ్చాత్తాపాన్ని ఇన్నేళ్ళుగా మరుగుపరచిన మహత్తర శక్తి ఏమై వుంటుంది! ఏమైవుంటుందో స్ఫురణకి రాగా జాలిగా నవ్వింది సీత!

ఉలిక్కిపడ్డాడు రామదాసు!

"నవ్వేను తప్పయితే మన్నించండి దాసుగారూ! ఎందుకు నవ్వేనో కారణం చెబుతాను; వినండి. ఒక మనిషి పచ్చటి బతుకుమీద నిప్పులు పోసిన మరో మనిషి దేశమ్మీద పడి మనుషుల్ని ఉద్ధరించే వ్యాపారం కొన్నేళ్ళుగా చేస్తున్నాడంటే, నవ్వు వచ్చి నవ్వేను. ఇన్నేళ్ళూ అతనెందరి మనుషుల్ని 'నాగు'చేసి వుంటాడో అంచనా వేసి ఆ మనుషుల బతుకుమీద జాలి పడ్డాను, 'నన్ను క్షమించు సీతా!' అని నన్నడిగినప్పుడే మీ రెంతమంది




ముందు తలొంచి నిలబడి క్షమించమని
పాధేయపడ్డారో లిస్టు రాసుకున్నారా?
మాపణలు చెప్పుకోడానికి మీకీ జీవిత
లం సరిపోతుందా? ఇవన్నీ అటుంచి.

జ్యోతి

వచ్చి వెళ్తుంటే తాగే సింహం ఆకస్మాత్తుగా
గడ్డితినే సాధు వయ్యిందంటే నమ్మే
దెలా? ఈ మార్పులో అంతర్యమేమిటి?"
ఆశ్చర్యంగా అడిగింది సీత.

'సీతా!'' అన్నాడాయన భయంగా.

''నిజమే చెప్పండి. అంతా నిజమే చెప్పండి. ఇంక నా జీవితంలో తిరిగి చూడలే ననుకున్న మనిషి తనంతట తానే వచ్చి తాను చేసిన దుర్మార్గాన్ని మన్నించమని ప్రాధేయపడుతుంటే నేను సుఖంగా నమ్మగలనా? అందుచేత, మా దృష్టికి కారణమేమిటో ముందు చెప్పండి.''

''నిజమే సీతా! నువ్వన్నది నిజం. నేనిప్పుడేం చెప్పినా నువ్వు సుఖంగా నమ్మలేవు. నా పాప పరిహారార్థం గుళ్ళూ గోపురాలు కట్టించే శ్రోమతు నాకుంటే వుండొచ్చుగాని. గుళ్ళో దేవుణ్ని చూసే జనం గుండెల్ని చేతుల్లో పట్టుకు మరీ చూస్తారు నువ్వన్నట్టు. ఈ సింహం గడ్డి తినడమే శరణ్యమనుకుంది. ఒక మహాసాధ్వికి అన్యాయం చేయడంతో నా రాజకీయ జీవితం ప్రారంభమైంది ఈ రాజకీయ జీవితం నన్ను మరింత కిరాత కుణ్ని చేసింది. చిన్న సింహాసనం సంపాయించేను. నీకు చేసిన కీడు మరి చేను పెద్ద సింహాసనాల వేటలో పడి నువ్వెక్కడ ఏలా బతుకుతున్నావో తెలుసుకోలేకపోయేను. వారం రోజుల క్రితం నా వారసులు చేసిన ఘాతకం. ఇన్నేళ్ళూ నిర్లక్ష్యం చేసిన నా అంత రాత్మ మీద దెబ్బ తీసింది. రాజకీయాలకి అంతరాత్మలేదంటని నన్ను తక్కువ చేయకు. నువ్వు నమ్మూ నమ్మకపో! నేనిప్పుడు అంతరాత్మకి లొంగేను సీతా. లొంగేను అందుకే నువ్వు గుర్తుకొచ్చేవు. నా వంశమంతా కిరాతకులమైపోతామనే భయం నాకు నా అంతరాత్మ కలిగించింది. నా వంశం చెడిపోగూడదు. అవసరమైతే. రాజకీయల్నే వదిలేస్తాను గాని. నా వంశం చెడిపోవడం సహించ లేను ఈ చెడు నాతోనే ఆగిపోవాలి. నన్ను నమ్మి వచ్చెయ్ నాతోపాటు నా యింటికి వచ్చి నా ప్రక్కనుండు నువ్వు నా పక్కనుంటే ...''

మధ్యలోనే మళ్ళా నవ్వేసింది సీత.

''సిగ్గు సిగ్గు ఇన్నేళ్ళొచ్చి మీకు నేను భార్యనా? తగుననమ్మంటూ ఇవాళ నేను మీ యింటికి రావాలా? వద్దండీ దాసుగారు వెళ్ళిపొండి నన్నిలా బతకనివ్వండి. ఈ సీత కష్టాలు మీవల్ల ముగింపుకొస్తే నా ఆశయానికి, నా ఆనందానికి అర్థంవుండదు. ప్రసా దున్నాడు. నా వరాలతండ్రి వాడున్నాడు. నాకు వాడు వాడికి నేనుగా వున్నా మిక్కడ. మా కష్టాల్ని మా ప్రయోజ కత్వమే ఆదుకోవాలిగాని మీలాటివాళ్ళ ఔదార్యంకాదు కానేకాదు. వెళ్ళరండి మరోమాట దాసుగారూ! నేనివాళ మీకు నా కథ చెప్తున్నాను. ఎందుకో తెలుసా? బహుశ గ్రహించివుంటరు ఆ కథలో నా దీక్షవుంది. నన్ను మోస గించి వెళ్ళిపోయిన మీకు ఆ దీక్ష ఎంత పవిత్రమైందో. ఎంత విలువైందో చెప్ప తీరాలనే కసికొద్దీ ఇంత కథా చెప్పేను. అంతేగాని మీ ఆదరణని ఆశించి కాదు. నన్నేమనుకుంటున్నారు? కేవలం ఆడసీత ననుకుంటున్నారా? కాదండిబాబు నేను ఆడసీతనుకాను మగవేషంలో కాలం గడుపుతూన్న సీతన్నేను. అంతే చెప్ప గలను. నేనేం చెప్పిందీ ప్రసాదుకు తెలీ కూడదు. వాడిని అతిభద్రంగా పెంచేను. వాడికి మన పాపకథ తెలుస్తే-ఫలితమే

# జరిగిన కథ-కవహావిహాషం

తిమ్మాపురం పురపాలక సంఘ ప్రెసిడెంటు రామదాసుకు ఆస్తి అంతస్తు అన్నీ ఉన్నాయి. ఆయన వారసుడు చిరంజీవి కాలేజీ ఎలక్షన్‌లో విలంబి గెలిచాడు.

ఆ కాలేజీలోనే చదువుతున్న వరప్రసాదంతో పరిచయం పెంచుకున్న సుమతి అకస్మాత్తుగా ప్లేటు ఫిరాయించి చిరంజీవి వైపు మొగ్గుతుంది.

సుమతి, చిరంజీవుల ప్రేమ గురించి సీతాపతి సత్యంతో చెప్పగా వారిద్దరికీ మాటమాటా పెరిగింది. ఒకరోజున సీతాపతి ప్రసాదును కారులో బీచ్‌కు తీసుకు వెళ్ళి సుమతి, చిరంజీవి ఒకరిలో ఒకరు ఏకమయ్యే దృశ్యాన్ని చూపించాడు.

మీరు త్వరలో తండ్రి కాబోతున్నారని సుమతి, చిరంజీవితో చెప్పగా గర్భ పాపం చేయించుకోమని సలహా ఇచ్చాడు. ఆ తరువాత చిరంజీవి సుమతిని కలవడమే మానేసాడు.

సుమతి తన గాధనంతా ప్రసాదంతో చెప్పగా ప్రసాదం రామదాసు గారితో మాట్లాడదామని వెళ్ళి, ఆయనచేత అవమానింప బడతాడు.

రామదాసుగారు చిరంజీవి ద్వారానే అతని ప్రేమ కథను తెలుసుకుని తన గతస్మృతులు గుర్తుకు వచ్చి ఏదో షాకు తగిలినట్టవుతుంది.

— ఇక చదవండి.

---

విఁటో మీకు అర్థంకాదు కనుక, వాడికి తెలీకుండా జాగ్రత్త తీసుకోండి. మన పీచచరిత్ర మూడో మనిషికి తెలీకూడదు. ఎదటిమనిషికి మేలుచేయాలనే మీనీతి పాఠం, ఈమేలుతోనే ప్రారంభం కానివ్వండి. వెళ్ళండింక... చూడండి. మనం మళ్ళా కలుసుకుందాం. మన అక్రమ సంబంధానికి మరోసారి పలుకరించుకోడం ఎంతైనా అవసరం! అదెప్పుడో తెలుసా దాసుగారూ... ఇంతలో కాదు. నా చివరిక్షణాల్లోనో, మీ చివరి క్షణాల్లోనో తప్పించి అంతకంటేముందు మనం మళ్ళా కలుసుకోకూడదు. మన మొహాలు చూసుకోకూడదు. అప్పుడే కలుసుకుందాం అప్పటివరకూ మీగూడు రాజకీయమే! సెలవు!"

"సీతా!" అన్నాడాయన బాధగా!

"నా కథ చెప్పేను. నా నిర్ణయం చెప్పేను. ఇంకా అలస్యంతగదు. వచ్చే జన్మకి మీరునేనై, నేనుమీరై ఇదే దొంగాట ఆడుకుందాం. అదే మీకుతగిన శిక్ష! సరేనా? వెళ్ళండయ్యాతే."

రామదాసు లేచి నిలబడ్డారు బరువుగా అక్కడ్నుంచి కదిలేరు! సీత యింక

గాలిపీల్చుకుంది.

## 12

రామదాసు తిమ్మాపురం వచ్చిన్నాదే. గుండెపోటు రావడంవల్ల మంచమెక్కారు. ఈ పోటు ప్రాణాన్ని క్షణంలో తీసుకుపోతే బావుండుననిపించింది వారికి. అల్లాగాకుండా మనిషిని వుండీ వుడిగి తింటోందాపోటు!

ఇంట్లోవున్న వెంకటస్వామి గ్గాని, వంటలక్కాకిగాని వారు తమగుండెపోటు విషయం చెప్పలేదు.

కాని—

చిరంజీవి మైసూరు మహాసభలకి హాజరైనట్టు వెంకటస్వామీ, వంటలక్కా రామదాసుకి చెప్పేరు.

''అంటే, వీడు ఈ సంవత్సరం పరీక్షలు రాయడం?'' అని అడిగేరాయన

చిరంజీవి పరీక్షలు రాయకపోతే వాటిల్లే నష్టమేవిఁటో, ఆ నష్టం ఏ ప్రజలకి సంబంధించిందో ఆ 'పనిమనుషులు'కి అర్థంకాలేదు. అందుచేతవాళ్ళు ఏ సమాధానమూ చెప్పలేదు.

''వీడు సుమతిని పట్టేట ముంచేస్తాడు!'' అని లోలోన అనుకున్నారు. ఆ అనుకోడంతో గుండెపోటు ఎక్కువయ్యింది.

'అబ్బా' అన్నారు.

'చంపేస్తూంది' అని గూడా అన్నారు

వెంకటస్వామికి అర్థమైపోయింది. అతను వెంటనే వీధిలోకి వెళ్ళి, మరో పావుగంటలో నరసయ్యని వెంటబెట్టు కొచ్చేడు.

నరసయ్య వస్తూనే నవ్వుతుంటూ అన్నాడు —

''బాబుకి నొప్పి వచ్చిందని వెంకటస్వామి చెప్పీ చెప్పడంతోనే వచ్చేశాను. ఏం బాబూ! ఇన్నాళ్ళూ ఎక్కడ కెళ్లేరు! ఎప్పు దొచ్చేరు! అది సరే మళ్ళా లోకనాధం బాబుతో ఏవైనా పేచీవచ్చాదా! మన దొంగ డాక్టరు బాబుని పిలవమంటారా! మీరు ఊఁ అంటే బాబూ. ఈ ఇల్లంతా మందీ మార్బలంతో నిండిపోద్ది. చెప్పండి బాబూ!''

అంతనొప్పిలో నూ రామదాసు సిగ్గుపడ్డారు.

''ఇంక, దొంగ డాక్టరుతోగాని, మందీ మార్బలంతోగాని పని వడదు నరసయ్యా! పీకా డ్రమ వుండదింక, రా. వచ్చి అలా కూచో!'' అన్నారు.

నరసయ్య కళ్ళింతని చేసుకున్నాడు. చుంటూ అన్నాడు.

''బాబేదో చిత్రంగా మాటాడుతున్నారు.''

రామదాసు పక్కగా వొత్తిగిల్లి కొంచెము సేపు విశ్రాంతి తీసుకుని చాలా నెమ్మదిగా అన్నాడు.

''ఈ ఏడాది మా చిరంజీవి పరీక్ష లెగ్గొట్టి మైసూరు మహాసభ కెళ్ళాడట. అందుచేత. వాడు నన్ను మించిన ప్రభువై నీ ముచ్చటలన్నీ తీర్చేయగలడు నరసయ్యా! నా సేవనొదిలేసి, చిరంజీవికి చిట్కాలు నేర్పు. నీతో అవసరం పడేవాళ్ళు అస్తమానం వుంటూనే వుంటారు.

నరసయ్య మరింత ఆశ్చర్యపడిపోయేడు.

''బాబు నన్ను వేళాకోళం చేస్తున్నారు.''

# బాల్డ్ హెడ్ బంద్

[వనమూలికా శిరో తైలము]

**బట్టతలకు భూలోక సంజీవిని!**









తయారుచేయువారు **బాలరాజ్ ప్రొడక్ట్స్** [రిజిష్టర్డ్]

1 B, చూళైమేడు హైరోడ్ • మద్రాసు-24

---

ముఖ్యమైన పట్టణములలో స్టాకిస్టులు, డిస్ట్రిబ్యూటర్లు కావలెను.

మద్రాసు సేల్స్ ఆఫీసు :

47, నార్త్ ఉస్మాన్ రోడ్, మద్రాసు-17.

(బలరామ రెడ్డి)

B. R P. Tel-3

"కాదు. నిజమే చెబుతున్నాను."

"అంటే!"

"రహస్యం చెబుతున్నాను విను. చిరంజీవిని చేతులారా నేనే పాడు చేసేను. నేను విషం తింటూ, వాడి చేత కూడా తినిపించేను. ఆ విషాన్ని ఏ దోసులో ప్రారంభించాలో కూడా చెప్పేసేను. వెధవ సూక్ష్మగ్రాహి. నా కడుపున పుట్టేడు గదా! విద్యని సులువుగా గ్రహించేడు. వెంటనే ఎదిగిపోయేడు.

ఇవాళ నేను వాడికి చెప్పే స్థితిలోనూ లేను. ఆశ్చర్యపడకు. నిజమే చెబుతున్నాను. 'నాయనా శివీ! నేనూ నువ్వూ ఇన్నాళ్ళూ విషమే తిని బతికేమురా! నేనిక ముందు విషాన్ని తినమగాక తినను. నా బాబువి కదూ. నువ్వూ తినకురా నాయనా' అని సలహానిస్తే వాడు నా మొహమ్మీద కొట్టేస్తాడేగాని నా సలహా వినడు. ఈ రాజకీయ విషాలో థ్రిల్స్ చాలా వున్నాయి నరసయ్యా! పది మంది నిన్ను ఆకాశాని కెత్తేస్తో పీకు పైకొస్తోంటే పరిస్థితిని వదులుకోడం కష్టం నరసా. చిరంజీవి మరి నాకు దక్కడు."

నరసయ్య తల తడుముకున్నాయి. గదినంతా పరిశీలించి చూశాడు రామదాసు గారిని మరీ మరీ చూసేడు. అకటికి ఈ వేదాంత రహస్యంలో నిజముందో లేక ఎగతాళివుందో తెలీడం లేదు చాలా బెంగారు పడిపోతున్నాడు. అతని నోట మాట పెగలి రావడం లేదు.

అంత నొప్పిలోనూ రామదాసు మెల్లిగా నవ్వేరు.

"దిష్టిబొమ్మనై పోయానేమిటోయ్ నరసయ్యా!" అన్నారు.

నరసయ్య చలించేడు.

"బాబూ నన్ను దిష్టిబొమ్మన్నారు. ఎన్నడూ వినని మాటలు బాబు నుంచి ఇవాళ వింటున్నాను. ఏం జరిగింది బాబూ! బాబు నెవరైనా మంత్రించేరా! బాబుకి ఎవరైనా మందు పెట్టేరా!"

రామదాసు తలూపేరు. తలూపి

"నువ్వన్నది నిజమే కావచ్చు"

"అయితే! అయితే బాబూ. నేనా మాటనలేను. మీరు నాకు చెప్పద్దు. ఇన్నేళ్ళు బాబు పక్కనున్నాను. బాబు దయవల్ల ఇల్లూ భూమి కొని పిల్లాపాపతో కులాసాగా వున్నాను. వేలి ముద్ర వేయడమే వచ్చు. ఇవాళ బాబు నన్ను వెళ్ళి బొమ్మని తోసేస్తే, బాబూ—కదలలేను. నా వేలిముద్రకిక దిట్టు మీటుండదు! నన్ను అన్యాయం చేయకండి."






"పిచ్చి వాడా! దేశాన్నేలే ప్రభువుల్లోనే వేలిముద్ర బాబులనేకమందున్నారు. ఇంకా నీ వేలికేవిఁటి భయం? ఈ తిమ్మాపురం యింతలో నిద్రలేవదు. నీ వేలిముద్రకి గిట్టుబాటు యింతలో తగ్గదు. నీకా భయమక్కర్లేదు. నీసాయం కావలిసిన బాబులనేకమందున్నారు. ఇంకనన్నొదులు నరసయ్యా! వస్తాను."

నరసయ్య కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి

"బాబు నన్నేడిపిస్తున్నాడు."

"ఇవాళ నేనూ ఏడుస్తున్నాను నరసయ్యా! ఎందుకో తెలుసా? చెప్పను. ఇప్పుడు నేను నిజం చెప్పినా ఎవరూ నమ్మరు. పైపెచ్చు నేనేదో దుర్మార్గం తలపెట్టేనని భయపడి చస్తారు. అందుచేత నేను చెప్పదలుచుకోలేదు. నీకు స్వామి భక్తి ఎక్కువని నేననుకుంటున్నాను. ఇన్నేళ్ళూ నేను చెప్తుండగానే నా నిర్ణయమేమిటో సరిగ్గా ఊహించి నువ్వు కొన్ని పనులు చేసేవు. ఇవాళ కూడా నీకేమీ ఉపదేశించను. నీకు మంచిదని తోస్తే అది చెయ్యి."

రామదాసు నరసయ్యకి ఇంకేం చెప్పేవాడోగాని. ఆ భవంతి ముందు (సరిగ్గా ఆ వేళకి) కారాగిన చప్పుడూ. మనుషులు మేడెక్కి తన గది సమీపించిన వైనమూ పసిగట్టి అన్నారు.

"ఎవరో వస్తున్నట్టుంది. నాకు గుండె పోటు వచ్చిన సంగతి దాచిపెట్టు."

నరసయ్య తలూపేడు.

(సశేషం)




# కాలగర్భంలో కలిసిపోయిన జేమ్స్‌బాండ్

ఈ కాలంలో జేమ్స్‌బాండ్ గురించి, బాండ్ చిత్రాల గురించి, బహుశ ఆ కోడ్ నెంబరు 007 గురించి వినని వాళ్ళు, చదవని వాళ్ళు చూడని వాళ్ళు ఎవ్వరూ వుండరు అంటే అతిశయోక్తి కాదేమో. చిన్నపిల్లవాడి దగ్గరనుంచి ముసలివాళ్ళ వరకూ జేమ్స్‌బాండ్ సినిమాలంటే చెవి కోసుకుంటారు. అసలు ఎవరీ జేమ్స్ బాండ్? ఇతన్ని ప్రేక్షకులు ఎందుకు అంతగా ఆకాశానికి ఎత్తేస్తున్నారు? జేమ్స్ బాండ్ నటించిన సినిమాలంటే ఎందుకు అంత పడిచస్తారు? ఈ ప్రశ్నలకు సమాధానం బహుశ ఏ కుర్రవాడ్ని అడిగినా చెప్పగలడేమో.

జేమ్స్‌బాండ్ అభిమాన ప్రేక్షకులు ఈ మధ్యనే ఒక దుర్వార్త విన్నారు. ఈ దుర్వార్త ఏమిటో తెలుసుకునేందుకు ముందుగా అసలు జేమ్స్‌బాండ్ ఎవరో ఏమిటో కధాకమామీషు అంతా తెలుసుకుందాం.

అసలు జేమ్స్‌బాండ్ పాత్ర సృష్టికర్త ఇయాన్ ఫ్లెమింగ్. ఈయన ఓ డజను పైగా అపరాధ పరిశోధక నవలలు వ్రాశాడు. ఈ అన్ని నవలల్లో హీరో పేరు జేమ్స్‌బాండ్. రచయిత బ్రిటిష్ దేశానికి చెందినవాడు. రచయిత జేమ్స్ బాండ్‌ను ఒక భయంకరమైన వ్యక్తిగా, అత్యంత మేధావి, సాహసికుడుగా చిత్రించాడు. ఈ పుస్తకాల్ని ఆధారంగా తీసుకుని సినిమాలు ఎందుకు తీయకూడదు అన్న ఆలోచన బ్రిటిష్ చిత్ర నిర్మాతలకు కలిగింది. ఇయాన్ ఫ్లెమింగ్ తన నవలల్లో వర్ణించిన జేమ్స్‌బాండ్ లాంటి వ్యక్తికోసం అన్వేషణ ప్రారంభించారు. వెతగ్గా వెతగ్గా రచయిత వర్ణనలకు సరిపడ్డ వ్యక్తి దొరికాడు. మంచి ఒడ్డు పొడుగు రెండు బుగ్గలపైన ఒంపులు, ఆజానుబాహువు అయిన వ్యక్తి లభించాడు. ఈయన పేరు సీన్ కానరి. అంతే అమాంతం సీన్ కానరీ జేమ్స్‌బాండ్ అయిపోయాడు. ఈ సినిమాలలో జేమ్స్‌బాండ్‌గా నటించిన వ్యక్తి పేరు సీన్ కానరీ అన్న విషయం తెలియనివాళ్ళు కూడా వున్నారనుకోండి.

అది వేరే విషయం. జేమ్స్‌బాండ్ పాత్ర ధారి సీన్‌కానరీ మాట ఏమోగాని. సీన్ కానరీని మాత్రం జేమ్స్‌బాండ్ అనే పిలుస్తారు.

'డాక్టర్ నో' చిత్రంలో సీన్‌కానరీ జేమ్స్‌బాండ్‌గా చిత్రలోకానికి పరిచయం అయ్యాడు. ఆ తరువాత 'ఫ్రమ్ 007 విత్ లవ్', 'గోల్ ఫింగర్', 'థండర్ బాల్', 'యువోన్లీ లివ్ ట్వైస్' చిత్రాలలో వరసగా నటించాడు. ప్రతి సినిమాలో జేమ్స్‌బాండ్ అతి క్రూరంగా వ్యవహరిస్తాడు. నిరాయుధులైన శత్రువుల్ని యిట్టే చంపేస్తాడు. ఫాసిస్టుగా, అపర హిట్లర్‌లా నటిస్తాడు. ఆడవాళ్ళ పట్ల ఎంతో అంహీనత, మానసిక దౌర్బల్యం కనిపిస్తుంది. ఇతని శత్రువులు ఎప్పుడు వివిధ రంగు జాతుల వాళ్ళు, కమ్యూనిస్టులో అయివుంటారు. అందు చేత జేమ్స్‌బాండ్ ఒక జాత్యంహకారుడుగా కమ్యూనిస్టు వ్యతిరేకిగా కనిపిస్తాడు.

షెన్నోక్ ఫిల్మ్ స్టూడియోలో తయారవుతున్న 'రెడ్ టెంట్' చిత్రంలో రోయల్డు అముండ్‌సెన్ అనే పాత్రను సీన్‌కానరీ ధరిస్తున్నాడు ఆ సందర్భంగా సీన్‌కానరీ మాస్కో వచ్చాడు.

అముండ్‌సెన్ పాత్ర నటించడానికి నేను ఎంతో అదృష్టవంతుడని. నిజానికి నా సినిమా జీవితంలో ఎంతో ముఖ్యమైనది అముండ్‌సెన్ ఒక హీరో, దక్షిణ ధృవం కనిపెట్టిన వ్యక్తి. ఉత్తర ధృవంలో అడుగుపెట్టిన మొదటి వ్యక్తి. కొద్దిపాటి మనోవికారం, అమిత మిత భాషి, ఉదార స్వభావి అని సీన్‌కానరీ ఎంతో ఉద్వేగంగా తను నటించబోయే పాత్ర గురించి వివరించాడు. 'క్రేన్స్ ఆర్ ఫ్లయింగ్' చిత్రాన్ని నిర్మించిన మైఖేల్ కలతోజోవ్ ఈ చిత్రాన్ని కూడా నిర్మిస్తున్నారు. ఆ సందర్భంగా సీన్ కానరీ మాస్కో వచ్చాడు మాస్కో షెరిమెత్యెవో విమానాశ్రయంలో కలతోజోవ్ మరికొందరు స్వాగతం చెప్పారు. ఆయన్ని జేమ్స్‌బాండ్ గురించి ఏమీ అడగవద్దని నిర్మాత కలతోజోవ్ మిగతా వాళ్ళను హెచ్చరించారు.

అసలు జేమ్స్‌బాండ్ పాత్ర గురించి ఒక్క మాటయినా మాట్లాడదలచుకోలేదని ఇటీవల రోమ్‌లో జరిగిన ఒక పత్రికా విలేఖర్ల సమావేశంలో సీన్‌కానరీ ప్రకటించాడు విమానాశ్రయంలో అడుగు పెట్టిన సీన్‌కానరీకి, సినిమాల్లో జేమ్స్‌బాండ్‌కి ఎక్కడా పోలిక కనిపించలేదు. 40 సంవత్సరాల వయస్సుగల సీన్‌కానరీ వదనం చాలా ప్రశాంతంగా, చిరునవ్వులు చిందిస్తూవుంది. సినిమాల్లో కనిపించే క్రూరత్వం, నిర్దాక్షిణ్యం, ప్రతి అయిదు నిముషాలకొకసారి మనుష్యుల్ని చావగొట్టే రాక్షసత్వం ఎక్కడా కనిపించలేదు.

లోగడ 'ఫిలింస్ అండ్ ఫిల్మింగ్' అనే మేగజైన్ ఒక వ్యాసం రాస్తూ, జేమ్స్‌బాండ్ లేబుల్ వున్న ఏ చిత్రానికయినా మంచి మార్కెట్ వుందని, జేమ్స్‌బాండ్ రివాల్వర్, జేమ్స్‌బాండ్ సూట్‌కేస్, 007 వోడ్కా, 007 పైజామా సూట్, 007 బెల్టు, ప్లాస్కు, లిప్స్ అవేశం వచ్చాయని వ్రాసింది. ఇయాన్ ఫ్లెమింగ్ పుస్తకాలు మిలియన్ల కాపీలు

కొద్దీ అమ్ముడుపోయాయి. బాండ్ చిత్రాలకు వచ్చినంత ఆదాయం మరే చిత్రాలకూ రాలేదు. అటువంటిది జేమ్స్ బాండ్‌గా తెరమీద సీన్‌కానరీ నటించాడంటే మరి ఆకాశానికి ఎత్తెయ్యరూ?

కాని సీన్‌కానరీకి జేమ్స్‌బాండ్‌పై అభిప్రాయాలు మరోలా వున్నాయి వాటి సారాంశం యిది. 1. జేమ్స్‌బాండ్ ఒక ప్రత్యేకమైన వ్యక్తి. 2. జేమ్స్‌బాండ్‌ను సీరియస్‌గా తీసుకోకూడదు 3. నేను జేమ్స్‌బాండ్‌కు ఎంతో ఋణపడివున్నాను. 4. నాకు జేమ్స్‌బాండ్ అంటే మొహం మొత్తింది.

జేమ్స్‌బాండ్ సృష్టికర్త అయిన ఇయాన్ ఫ్లెమింగ్ రచనల్ని కూడా సీన్ కానరీ విమర్శించాడు. ఆయన రచనలో అన్ని సన్నివేశాలూ చాలా గంభీరంగా వుంటాయి అందుకని నేను బాండ్ సినిమాలలో కాస్త హాస్యంపాలు ప్రవేశపెట్టాను అని సీన్‌కానరీ పేర్కొన్నాడు.

నిజానికి నేను జేమ్స్‌బాండ్‌కు ఎంతో ఋణపడివున్నాను. నాకు యింత పేరు ప్రఖ్యాతులు రావడానికి కారణం ఆ జేమ్స్‌బాండే కాని అస్తమానూ, ఆ స్త్రీని పట్టడం. కాసేపు నేను తన్నులు తినడం. ఎక్కువసేపు ఎంటివాడ్ని చావగొట్టడం. రివాల్వర్లతో ఆటలాడుకోవడం. ముద్దులు పెట్టుకోవడం. దూకడం. ఎగరడం. ఈదడం. పొడవడం. తన్నడం. కారు డ్రయివింగ్‌లు. ముష్టిఘాతలతో నాకు విసుగెత్తింది. మొహం మొత్తిపోయింది. నాకీ ఈ పాత్ర అంటే రోత పుట్టింది. అని స్వయంగా సీన్‌కానరీయే ఒప్పుకున్నాడు.

బాండు గురించి చివరిసారిగా మీతో మాట్లాడుతున్నాను. బాండు లేడు. కాలగర్భంలో కలిసిపోయాడు. కనీసం నావరకయినా శవాల గురించి మనం మాట్లాడటం మానేస్తే మంచిదని విమానాశ్రయంలో ఒకాయన అడిగిన ప్రశ్నకు సీన్‌కానరీ సమాధానం యిచ్చాడు.

సీన్‌కానరీ జేమ్స్‌బాండుగా నటించనని ప్రకటించడం అభిమాన ప్రేక్షక లోకానికి నిజానికి ఒక పెద్ద దుర్వార్తే.

అయినా యింకా జేమ్స్‌బాండు సినిమాలు వస్తూనే వున్నాయి. ఇయాన్ ఫ్లెమింగ్ నవలల్లో ఒకటయిన 'ఆన్ హర్ మెజెస్టీస్ సీక్రెట్ సర్వీస్.' హిజ్ మెజెస్టీస్ సీక్రెట్ ఏజెంటు 007 గా నిర్మాణం పూర్తయింది. దీంట్లో జేమ్స్‌బాండు సీన్‌కానరీ కాదు. ఆస్ట్రేలియాకు చెందిన జార్జి లిసెన్బే. ఈయన యీ ఒక్క సినిమాలో నటించి. నిర్మాతలకు చేతులెత్తి నమస్కరించడం పెట్టేశాడు విసుగెత్తిపోయింది. నటించను పొమ్మన్నాడు. నిర్మాతలు నీరుకారిపోయారు

ఏదేమయినా జేమ్స్‌బాండుకున్న పేరు ప్రఖ్యాతులు అంతకంతకూ అడుగంటిపోతున్నాయి. బాండును తెరమీద సృష్టించిన సీన్‌కానరీయే బాండును అసహ్యించుకున్నాడు. ఇక జేమ్స్‌బాండు కాలగర్భంలో కలిసిపోయాడనే అనుకోవచ్చు.

(సోవియట్ వ్యాపార సౌజన్యంతో)

## బాలరాజు కథ

తమిళంలో శతదినోత్సవాలు జరుపుకొన్న "నా రాజా వా" చిత్రం ఆధారంగా శ్రీ బాపు దర్శకత్వంలో లక్ష్మి ఎంటర్ ప్రైజస్ వారు తెలుగులో నిర్మిస్తున్న చిత్రం "బాలరాజు కథ".

ప్రసిద్ధ పల్లవ మహారాజులు కట్టించిన ఏకాండీ శిల్ప కళాక్షేత్రం - నేటి మహాబలిపురం యీ చిత్రానికి కథా స్థలం!

దాదాపు మూడు వంతులు మహాబలిపురం పరిసరాలలో పూర్తవుతున్న ఈ చిత్రంలో కథానాయకుడు మాస్టర్ ప్రభాకర్. పనిగండం మా మల్లయ్యగా నాగభూషణం; వధ్నాలగుపుంది సంతానంతో సతమతమవుతున్న ఆవర్శ గయ్యాళిదంపతులు సాక్షి రంగారావు, సూర్యకాంతం. ఆలు రామలింగయ్య హెడ్ లేని హెడ్ గాను, జానీ లేని కానిస్టేబుల్‌గాను నటిస్తున్నారు

ముళ్ళపూడి వెంకటరమణ మాటలు, ఆరుద్ర, కొసరాజు పాటలు; మహాదేవన్ సంగీతం; మిక్కిలినేని, ధూళిపాళ, అశోక్‌కుమార్, రావి కొండలరావు, వల్లరామ్మూర్తి, శీతారాం, పి. వెంకటేశ్వరరావు, విజయచందర్, హేమలత, సంధ్యారాణి, ప్రసన్నరాణి, కనకదుర్గ, పుష్పకుమారి, విజయరాధిక, శైలజ రాణీ, సర్కార్, మాస్టర్ శేషగిరిరావు, విశ్వేశ్వరరావు; బేబీ డాలి, బేబీ సుమతి మొదలగు సాంకేతిక, నటీనటులతో తయారవుతున్న ఈ చిత్రం ఆగస్టులో లక్ష్మీ ఫిలింస్ ద్వారా విశాలాంధ్ర అంతటా విడుదలకు సిద్ధమవుతున్నది. నిర్మాత శ్రీమతి విజమూర్తి పద్మాక్షి.

## పంచరంగుల చిత్రం

## దసరా బుల్లోడు

జగపతి ఆర్ట్ పిక్చర్స్‌వారి "దసరా బుల్లోడు" వసందైన పంచరంగులలో తయారవుతున్నాడు. పదకొండు పాటలు రికార్డు చేయబడ్డాయి. ఇప్పటికి ఐదుపాటలపై చిత్రీకరణ జరిగింది. మొదటి రెండు షెడ్యూల్సు అనకాపురం, కృష్ణా జిల్లాలలో భట్లపెనుమర్రులో జరిగాయి. ఇంతవరకు నాలుగురీళ్ళ చిత్రం పూర్తయింది. ఔట్‌డోర్ షూటింగ్ సమయంలో భట్లపెనుమర్రు గ్రామ ప్రజల సహకారానికి ఆ వూరి పశువైద్యశాల ప్రహరీ నిర్మాణ సహాయార్థంగా పంచాయతీవారికి రూ. 1500/— విరాళంగా చిత్ర నిర్మాత, దర్శకులు శ్రీ రాజేంద్రప్రసాద్ సమర్పించారు.

ముఖ్యపాత్రలలో ఏ. నాగేశ్వరరావు, యస్ వి రంగారావు, గుమ్మడి, నాగభూషణం, పద్మనాభం, వాణిశ్రీ, చంద్రకళ, అంజలి, సూర్యకాంతం, రాధాకుమారి, బేబీ బ్రహ్మాజి నటిస్తున్న యీ చిత్రం సెప్టెంబరు నెలాఖరుకు పూర్తవుతుంది.

ఆచార్య ఆత్రేయ మాటలు, కె. వి. మహాదేవన్ సంగీతం, ఛాయ ఎస్. వెంకటరత్నం మొదలైన సాంకేతిక వర్గంతో హైదరాబాద్ శ్రీ సారథి స్టూడియోలో నిర్మింపబడుతూంది.



మధు పిక్చర్స్ 'ఇంటి గౌరవం'లో
శోభన్‌బాబు, నాగభూషణం, పి. వెంకటేశ్వరరావు, జానకి.

## చిట్టి చెల్లెలు

మురుగన్ బ్రదర్స్ బ్యానర్‌లో ఏ. వి. యం. స్టూడియోలో అవిరామకృషితో నిర్మిస్తున్న సాంఘిక చిత్రం "చిట్టి చెల్లెలు" పూర్తయింది. జూలై నెల 29న విశాలాంధ్ర అంతటా విజయా డిస్ట్రిబ్యూటర్స్ ద్వారా విడుదలవుతున్న ఈ చిత్రం తుదిమెరుగులు దిద్దుకుంటోంది. ముఖ్యపాత్రలలో ఎన్. టి. రామారావు, హరనాథ్, గుమ్మడి, వాణిశ్రీ జగ్గారావు, రేలంగి, పద్మనాభం, గీతాంజలి నటిస్తున్నారు.

## సుగుణసుందరి కథ

ఆగస్టులో విడుదల కానున్న పి. ఎస్. ఆర్ పిక్చర్స్ "సుగుణ సుందరి" జానపద చిత్రం తాలూకు షూటింగ్ అతి త్వరగా జరుగుతూంది. కాంతారావు, రామకృష్ణ సత్యనారాయణ, త్యాగరాజు, మిక్కిలినేని, రామచంద్రరావు, నూతన నటుడు నగేష్, దేవిక, విజయలలిత, జ్యోతిలక్ష్మి, మణిమాల, పుష్పకుమారి నటిస్తున్న ఈ చిత్రానికి చిల్లర భావనారాయణ కథ, మాటలు; కోదండపాణి సంగీతం; పి. నారాయణరెడ్డి, కొసరాజు, ఆరుద్ర, చిల్లర భావనారాయణ. పాటలు;

హెచ్. ఎస్. వేణు ఛాయ. దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్ర నిర్మాత శ్రీ పింజల సుబ్బారావు. ప్రెస్ రిలేషన్స్: శ్రీ కృష్ణ.

## స్వరాజ్యలక్ష్మి ప్రొడక్షన్స్

స్వరాజ్యలక్ష్మి ప్రొడక్షన్స్ తమ మొదటి జానపద చిత్రం పద్మశ్రీ యన్. టి. ఆర్. స్విచ్ ఆన్ చేయగా శ్రీ రాజ నాల క్లాప్స్ కొట్టగా జూన్ 21 వాహిని స్టూడియోలో సుభముహూర్తాన షూటింగ్ ప్రారంభమైంది. 21 నుంచి 27 వరకు నాలుగు సెట్స్‌లో పని పూర్తి చేశారు. ఈ చిత్రంలో మొత్తం ఏడు పాటలుం టాయి. కాంతారావు, రాజనాల, కె వి. చలం, త్యాగరాజు, ధూళిపాళ, బాల కృష్ణ, జగ్గారావు బేబీ రాణి, విజయలలిత, అంజలి, గీతాంజలి, విజయశ్రీ, రాజ్ కుమార్ నటిస్తున్న ఈ చిత్రానికి దర్శ కులు బి వి. శ్రీనివాస్. రచన జి. కె. మూర్తి, పాటలు సి. నారాయణరెడ్డి, దాశ రథి, జి కె మూర్తి. నిర్మాణ నిర్వహణ కుదరవల్లి శీతారామస్వామి, నిర్మాత కుదర వల్లి శ్రీరామమూర్తి

సంగీతం టి వి. రాజు.
విజయ కంబైన్స్ రిలీజ్.

## 'పట్టినదల్లా బంగారం'

శ్రీ తోట సుబ్బారావు సమర్పిస్తున్న శ్రీ లక్ష్మి పిక్చర్స్ అండ్ కో 'పట్టినదల్లా బంగారం' చిత్రం శరవేగంతో తయా రవుతూంది. తిరుమల చంద్రగిరి లోయ ప్రకృతి సౌందర్యంతో కొన్ని ముఖ్యమైన సన్నివేశాలు అతిక్రమకోర్చి చిత్రీకరిం చటం జరిగింది.

చలం, రాజశ్రీ, హరనాధ్, విజయ లలిత, రేలంగి, సత్యనారాయణ, రమణా రెడ్డి (గెస్ట్) అల్లు రామలింగయ్య, ఛాయా దేవి, సరిత, కె వి చలం, రామచంద్ర రావు మరియు జగ్గయ్య నటీనటులు.

శ్రీ పి వెంకటరత్నం నిర్మిస్తున్న ఈ చిత్రానికి బి ఎల్. ఎన్. ఆచార్య సంభాషణలు; ఘంటసాల సంగీతం; ఎస్. ఎస్. లాల్ ఛాయ; వాలి కళ; బి గోపాల రావు కూర్పు; జి వి. ఆర్ శేషగిరిరావు దర్శకత్వం: శ్రీ కృష్ణ ప్రెస్ రిలేషన్స్.

## రౌడీ రాణి

శ్రీ ఏ. పూర్ణచంద్రరావు శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ బ్యానర్‌లో నిర్మిస్తున్న క్రైం థ్రిల్లర్ 'రౌడీ రాణి'గా విజయలలిత నటిస్తున్న ఈ చిత్రాన్ని జూన్ 8 న ప్రారంభించారు. మలేషియా నాట్య సుందరి కిస్‌మిస్ ఈ చిత్రంలో ప్రత్యేక పాత్రలో కనుపిస్తుంది. నిర్విరామంగా షూటింగ్ పూర్తి చేసుకుంటున్న ఈ చిత్రం ఆగస్టులో విడుదలకు సిద్ధమవు తూంది.

ఇతర పాత్రలలో జ్యోతిలక్ష్మి, మధు మతి, భవాని, బేబీ బ్రహ్మాజీ, బేబీ శ్రీదేవి, రాజబాబు, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, సహిల్వాన్ కాంతారావు, ధూళిపాళ, రావి కొండలరావు, బెజవాడ నాయుడు, రాజారెడ్డి మొదలగువారు నటి స్తున్నారు,

RamaRaoArts

విజయలక్ష్మీ మూవీస్ వారి

# ఆడజన్మ

డైరెక్షన్ ఐ.యస్.మూర్తి

నిర్మాత జి.వి.యస్.రాజు

మాటలు భమిడిపాటి రాధాకృష్ణ * సంగీతం మాస్టర్ వేణు

కెమెరా కన్నప్ప * కూర్పు NS ప్రకాశం

ఆర్ట్ చలం * అసోసియేట్ దుర్గానాగేశ్వరరావు BRP

డిస్ట్రిబ్యూటర్స్ అఖిలప్రభాస్ ఎంటర్‌ప్రైజెస్
నవయుగ విడుదల

కె. యస్. ఆర్. దాస్. దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రానికి విశ్వప్రసాద్ కథ, మాటలు; వీటూరి పాటలు వ్రాశారు. సంగీతం సత్యం; నృత్యాలు కె. యస్. రెడ్డి, ఛాయ కన్నప్ప. కళ చలం సమకూర్చుతున్నారు

## అత్తలూ—కోడళ్లూ

వంటపీ ఫిలింస్ వారు 'అత్తలూ-కోడళ్ళు' చిత్రం తాలూకు తొలి పాటను విజయ గార్డెన్స్‌లో జూలై మొదటి తేదీన కె.వి. మహదేవన్ సంగీత దర్శకత్వంలో ఆత్రేయ రచించి, సుశీల పాడగా రికార్డు చేశారు.

కృష్ణ వాణిశ్రీ, నాగభూషణం, మణిమాల, రేలంగి, సూర్యకాంతం, చంద్రమోహన్, ఛాయాదేవి, అల్లు రామలింగయ్య, నిర్మల, పెరుమాళ్ళు, రాజబాబు, కె. వి. చలం మొదలగువారు నటవర్గం, దర్శకత్వం పి. సి. రెడ్డి బి. ఏ; నిర్మాతలు శ్రీ నారాయణ సుబ్బరాయుడు. శ్రీ జె. ఎ రామసుబ్బయ్య.

## పచ్చని సంసారం

బి. ఎన్. మూవీస్ వారి "పచ్చని సంసారం" శరవేగంతో తయారవుతున్నది. గోల్డెన్ స్టుడియోలో వాణిశ్రీ, కృష్ణలపై కొన్ని ముఖ్యమైన సన్నివేశాలను చిత్రీకరించడం జరిగింది. ఈ చిత్రంలో గుమ్మడి ఒక విశిష్టమైన పాత్రకు జీవం పోస్తున్నారు. లక్ష్మీదీపక్ అతి దాకదక్ష్యంతో ఈ చిత్రాన్ని దర్శకత్వం చేస్తున్నారు.

## పవిత్రబంధం

నేటి సమాజంలో నిరుద్యోగ సమస్య ఏ విధంగా తలెత్తుతుందో, దాని పర్యవసానం ఎలా పరిణామం చెందుతుందో కళ్ళకు కట్టినట్లు చిత్రీకరించి నిరూపించే చిత్రం అశోక్ మూవీస్‌వారి "పవిత్ర బంధం".

అక్కినేని నాగేశ్వరరావు, వాణిశ్రీ, కాంచన, పద్మనాభం, గీతాంజలి ముఖ్య భూమికల్లో కనుపిస్తారు. దర్శకత్వం వి. మధుసూధనరావు నిర్వహిస్తున్నారు. శ్రీ టి గోవిందరాజన్ నిర్మిస్తున్న ఈ చిత్రానికి సహనిర్మాత శ్రీ టి. వి. ఎస్. శాస్త్రి.

## సుభాషిణి

శ్రీ హేమాంబరధరరావు మద్రాసు వడపళనిలో నిర్మించిన ఎయిర్‌కండిషన్డ్ ప్రీవ్యూ థియేటర్‌కు "సుభాషిణి" అని నామకరణం చేశారు. జూలై 1 న పద్మశ్రీ ఎన్. టి. రామారావు థియేటర్‌ను శుభ సమయాన ప్రారంభోత్సవం చేశారు. శ్రీ కామరాజు స్విచ్ ఆన్ చేశారు. తర్వాత 'దేవత', 'కథానాయకుడు' చిత్రాల్లోని కొన్ని ముఖ్యమైన ఘట్టాలు, 'బాబా నెహ్రూజీ' డాక్యుమెంటరీ చిత్రాన్ని ప్రదర్శించారు.

'చిట్టి చెల్లెలు'లో వాణిశ్రీ, రామారావు మొ॥వారు

---

## సతి అనసూయ

శ్రీకాంత్ అండ్ శ్రీకాంత్ ఎంటర్ ప్రయిజస్ వారు కలర్‌లో నిర్మిస్తున్న పౌరాణిక చిత్రం "సతీ అనసూయ". మహాసాధ్వి అనసూయగా జమున. అత్రి భూమికను కాంతారావు ధరిస్తున్నారు. ఇంకా ముఖ్యమైన పాత్రలలో శారద, సత్యనారాయణ, శోభన్‌బాబు, రాజ్‌బాబు, ప్రభాకరరెడ్డి, మీనాకుమారి నటిస్తున్నారు. దర్శకత్వం బి. ఎ. సుబ్బారావు.

## రంగేళీ రాజా

రాజ్యం పిక్చర్స్ నిర్మిస్తున్న రంగేళీ రాజా జూలై 1న హైదరాబాద్ సారథి స్టూడియోలో షూటింగ్ ప్రారంభమైనది. రంగేళీ రాజాగా అక్కినేని నాగేశ్వరరావు నటిస్తున్నారు. ఇది చక్కని హాస్య సమ్మిళితమైన ఫామిలీ సెంటిమెంట్ కథ. ఇప్పటికి మూడు పాటలు రికార్డు చేయబడ్డాయి. ప్రధాన పాత్రలో కాంచన, గుమ్మడి, చలం, సత్యనారాయణ మొదలగువారు కనిపిస్తారు. దర్శకత్వం సి. యస్. రావు. నిర్మాతలు శ్రీమతి లక్ష్మీరాజ్యం, శ్రీధరరావుగారలు.

## ఇద్దరమ్మాయిలు

ప్రొడ్యూసర్స్ కంబైన్స్‌వారు తెలుగులో నిర్మిస్తున్న కలర్ చిత్రానికి 'ఇద్దరమ్మాయిలు' అని నామకరణం చేయటం జరిగింది. వాణిశ్రీ యిందులో ఇద్దరమ్మాయిలుగా నటిస్తోంది. అక్కినేని నాగేశ్వరరావు యిద్దరమ్మాయిలలో ఒక మ్మాయి ప్రియుడుగాను శోభన్‌బాబు మరొకమ్మాయి భర్తగాను నటిస్తున్నారు. మిగిలిన పాత్రలలో ఎస్. వి. రంగారావు. గుమ్మడి. రాజ్‌బాబు. రమాప్రభ. నాగయ్య. రావి కొండలరావు. రుక్మిణి గారలు కనుపిస్తారు. దర్శకత్వం ఎస్. ఆర్. పుట్టన్న.

## అదృష్టదేవత

విజయలలిత పిక్చర్స్ పేరిట శ్రీ పీటూరి నిర్మిస్తున్న 'అదృష్టదేవత' చిత్రం మూడువంతులు పైగా పూర్తయింది. కె. యస్. ఆర్. దాస్ దర్శకుడు. ముఖ్య భూమికలలో కాంతారావు. సత్యనారాయణ. రామకృష్ణ. అల్లు రామలింగయ్య. ధూళిపాళ. త్యాగరాజు. మిక్కిలినేని. బాలకృష్ణ. వాణిశ్రీ. విజయలలిత. సురేఖ. పుష్పకుమారి. శ్యామల కనుపిస్తారు.

## ఒకే కుటుంబం

యాక్టర్ నాగభూషణం సమర్పిస్తున్న చిత్రం 'ఒకే కుటుంబం' జూన్ 10 న స్యూటోన్ స్టుడియోలో శాస్త్రోక్తంగా ప్రారంభమైనది. ముఖ్య పాత్రలలో ఎన్. టి. రామారావు. కాంతారావు. నాగభూషణం. అల్లు రామలింగయ్య. ధూళిపాళ. లక్ష్మి. రాజశ్రీ. రుక్మిణి ధరిస్తున్నారు. ప్రఖ్యాత తమిళ దర్శకుడు ఎ. భీమ్‌సింగ్ దర్శకత్వం వహిస్తున్నారు.

## తెలుగులో "వియత్నాం వీడు"

తమిళంలో నాటకంగా రూపొంది అశేష తమిళప్రజల ఆదరాభిమానాలను చూరగొని, సినిమాగా రూపొంది మద్రాసులోని ఆంధ్రులను కూడా విశేషంగా ఆకర్షించిన "వియత్నాం వీడు" చిత్రాన్ని శ్రీమతి సావిత్రి తెలుగులో నిర్మించేందుకు సన్నాహాలు జరుపుతున్నారు. తమిళంలో పద్మిని ధరించిన పాత్రను సావిత్రి తెలుగులో పోషింతటమేగాక దర్శకత్వ భారం కూడా వహించనున్నది.

## రౌడీరంగడు

కిశోర్ పిక్చర్స్ బానర్‌లో శ్రీ కనకమేడల నిర్మిస్తున్న క్రయిమ్ థ్రిల్లర్ రౌడీరంగడు షూటింగు జూన్ 18 నుండి 22 వరకు గోల్డెన్ స్టూడియోలో జరిగింది కల్లుపాక సెట్టులో నటసామ్రాట్ శ్రీ యస్వీ రంగారావు. శ్రీ వల్లరామమూర్తి. శ్రీ సీతారాం పాల్గొన్నారు. శ్రీ కొసరాజు రాసిన "నిషాలోనే వుందిరా మజా" అన్న పాటను మాధవపెద్ది పాడగా రౌడీరంగడు పాత్రను



ఇద్దరమ్మాయిలు లో
నాగేశ్వరరావు వాణిశ్రీ ఎస్ వి ఆర్ నాగయ్య

---

పోషిస్తున్న శ్రీ యస్ వి ఆర్‌పై చిత్రీకరించారు ప్రముఖ హాస్యనటుడు అయిన నల్ల రామమూర్తి సతారాంల హాస్య సన్నివేశాలు కల్లుమూత మాయమ్మా అన్న నల్ల రామమూర్తి పాడిన పాట సీతారాం వ తతో సహజ హాస్యాన్ని అందించుతాయి శ్రీ యస్వీ ఆర్ త్రాగిన మైక తో పాడుతూ నటించిన సన్నివేశాలు ప్రేక్షకుల్ని మైమరపి వ చేయగలవు

ఈ చిత్రానికి కధ మాటలూ శ్రీ కనక మేడల దర్శకత్వ శ్రీ కె వి నందన రావు సంగీత శ్రీ బి గోపాల కెమేరా శ్రీ వి పి ఆర్ చౌదరి ఈ చిత్రం సగం పూర్తయింది సెప్టెంబరులో విడుదల చేయాలని నిర్మాత సంకల్పం

## కన్నన్ ప్రొడక్షన్స్ వారి
## ఛాయామహల్

మనం అనేక స్పై చిత్రాలు చూశాం ఇంతవరకు ఎన్నడూ మనం చూడని విచిత్రమైన సాంఘిక స్పై చిత్రం



బాలరాజు కథ లో అల్లురామలింగయ్య నాగభూషణం

---

చిత్రం దర్శ్రీ ఎన్ టి రామారావు నాజర్శ్రీ జగయ్య రాజ్‌బాబు అల్లు రామలింగయ్య సత్యనారాయణ శాంత కుమారి మొదలగు ప్రముఖ నటీనటులతో తయారు కానున్నది బి బాల సుబ్రహ్మణ్యం కథకు పినిశెట్టి రచన ఎ హనుమంతరావు సంగీతసారథ్యం వాలి కళ ఎ ఎ వెంకటేశ్వరరావు అసోసియేట్ దర్శకుడు బి ఏ సుబ్బా రావు నిర్మాత కె యస్ గుప్తా నిర్మాతకాం

కొసరాజు వ్రాసిన 3 పాటలు రికార్డింగుకు ఎదర చేయబడాయి పీటిని ఘంటసాల పి సుశీ ఎల్ ఆర్ ఈశ్వరి పిఠాపుర నాగేశ్వరరావు పాడ గలరు జెమినీలో యీ 17 వ పాటని రికార్డింగ్ జరుగుతుంది ఆగస్టు 15 నుంచి షూటింగ్ ప్రారంభిస్తున్నారు పూర్ణా రిలీజ్ చిత్రం యిది



# అందరూ మారాలి!

మే జ్యోతిలో నలాది కనకారావుగారు వ్రాసిన 'ఎవరు మారాలి?' చదివి ఇది వ్రాస్తున్నాను. ఆయనన్నట్లు నేటిచిత్రాల స్థాయిపతనానికి కారకులు మీరంటే మీరని అందరూ వాదులాడుకుంటున్నారు. ఎవరితప్పులు వారు దిద్దుకోవడం మానేసి ఒకరి తప్పులొకరిపై రుద్దుకోవడం శోచనీయం ఇటువంటిస్థితిలో ఎవరు మారాలీ అని అంటే తిరిగి మీరంటే మీరేనని మొదటకేవస్తారు. అంతేగాని, 'తప్పు మాదికాదుగదా?' అని ఆత్మపరిశీలన చేసుకోవడానికి ప్రయత్నించరు. మంచికి షరాలు వేసే రోజులు రావాలంటే వంచిస్తూ అపవాదులు వేసే రోజులు పోవాలి. మారవలసింది నేటి చిత్ర పరిశ్రమ అని గుర్తించాలి. మార్పువలసింది మనమందరమూ అన్న నిశ్చయానికి రావాలి. 'మనమందరమూ అంటే నిర్మాతలూ, దర్శకులూ, నటీనటులూ. డిస్ట్రిబ్యూటర్లూ ప్లస్ ప్రేక్షకులూ అని నా అభిప్రాయం నేటిచిత్రాల స్థాయికి కారకులు ప్రేక్షకులేనని, వారెటువంటి చిత్రాలు ఆదరిస్తున్నారో మేమటువంటి చిత్రాలనే నిర్మిస్తున్నామనీ నిర్మాతలూ, దర్శకులూ అంటున్నారు. ఇలా, ప్రేక్షకులపైనే నిందవేస్తున్నారు. కాని ప్రేక్షకులు. చిత్రాలస్థాయి ఏమీ బాగుండడం లేదని, అసభ్యత తాండవిస్తోందని అంటున్నారు; అసహ్యించుకుంటున్నారు, అటువంటి చిత్రాలు వస్తున్నాయి గనుకనే మేమూ చూస్తున్నాం అనికూడ అంటున్నారు కొందరు. ఇది చెట్టుముందా? విత్తుముందా? బాపతు సమస్య ఈ సమస్య సమసిపోవాలంటే ఒకపని చేయవచ్చు. నేడు ప్రతిఊర్లోనూ అభిమాన సంఘాలు ఏర్పడున్నట్లే ప్రతిఊర్లో ప్రేక్షక సంఘాలు (సినీగోయెర్స్ ఎసోసియేషన్స్) లాంటివి. ఏర్పడాలి (కొన్ని నియమాలు పెట్టుకోవాలి). ఒక సినిమా రిలీజవగానే మొదటిరోజునే సంఘసభ్యులు ఆ సినిమా చూడాలి ఆ సినిమాలో మితిమీరిపోయిన శృంగారం; అశ్లీలత ప్రతిబింబించే సన్నివేశాలు; నాట్యాలపేరిట నటీమణులు వేసే అంగసౌష్ఠవ ప్రదర్శనలు; అసభ్యమైన వస్త్రధారణలూ ఉన్నట్లయితే.ఇంతెందుకూ, ఆ చిత్రం నైతికదైతే ఆ సినిమా మరి ప్రదర్శించడానికి వీల్లేదని ఒక 'రిప్రజెంటేషన్ ఇవ్వాలి హాలుదగ్గ 'పికెటింగ్' చెయ్యాలి (ఈ అభిప్రాయాన్నే ఒక ప్రముఖ నటుడు ఒకసారి తెలిపినట్లు జ్ఞాపకం) ఇదేమీ అసాధ్యమైన పనికాదు. అసమంజసంగా ఉంటుందనికూడ అను

కోసం. ఈ మాత్రంపని ప్రతీఊర్లోనూ జరిగిననాడు మనకోసం తప్పక ఉత్తమ చిత్రాలు ఉత్తర క్షణంలోనే తయారవుతాయి. ఇదిటు ఉంచుదాం. ప్రేక్షకుల వరకూ రానీయకుండా కేవలం మన నటీ నటులందరూ తలచుకుంటే ఉత్తమ చిత్రాలు నిర్మించబడగలవు 'దర్శకులు చెప్పినట్లే చేయవలసివస్తోంది' లాంటి సాకులు చెప్పడం మానేసి 'నటీ నటులందరూ' ఏకగ్రీవంగా ఒక తీర్మానానికి రావాలి. దాని ప్రకారం తాము నటించే చిత్రాల్లో ఏవయినా తమఅభిప్రాయాలకు భిన్నంగా (అంటే అసభ్యంగా) ఏర్పడితే ఆ చిత్రంలోని నటీ నటులందరూ తాము అందులో నటించమని చెప్పేయాలి. అట్లయితే ఆ చిత్రం మరి నిర్మించబడదుగా. అలాచేస్తే తమచిత్రాల సంఖ్య (తదనుగుణంగా ఆర్జనలో అంకెలసంఖ్య) తగ్గిపోతుందని భయపడనవసరంలేదు ఎందుకంటే నిర్మాతలు ఆ పరిస్థితుల్లో 'తప్పనిసరిగా' మంచి చిత్రాలు నిర్మించక తప్పదు. (మంచి చిత్రాలు నిర్మిస్తే ఆదరించబడతాయని చెప్పడానికి 'మనుషులు మారాలి' ఉదాహరణ). ఇదికూడ అసాధ్యమైన పనికాదు. ఇదట్లా ఉంచుదాం నటీ నటులవరకూ రానీయకుండా కేవలం నిర్మాతలే ఉత్తమ చలనచిత్ర నిర్మాణ లక్ష్యం పెట్టుకుంటే అది సాధ్యపడదా? పడుతుంది. అయితే కేవలం వ్యాపారం చేస్తూ కళకు మాత్రం అపకారం చెయ్యకూడదు. అప్పుడే అది సాధ్యపడుతుంది.

ఇక దర్శకులు. నిజానికి అంతటికీ వీరే మార్గదర్శకులు. మనకు ఉత్తమచిత్రాలందించే శక్తి వీరికి లేకపోలేదు. హిందీ చిత్రరంగంలోకి దుమికి ఆర్థికంగా విజయాన్ని సాధిస్తున్న వీరు ఉత్తమ తెలుగు చిత్రనిర్మాణ సంకల్పంతో ఎదురు దెబ్బలను సైతం ఓర్చి విజయాన్ని సాధించగలరు. మరి డిస్ట్రిబ్యూటరు వారు మన సంస్కృతి. సాంప్రదాయాలను మరువక చిత్రాలను 'సెలక్ట్' చేసుకోవాలి. ఇంతకంటే వారేమీ చేయనవసరం లేదేమో ఈ విధంగా అభిప్రాయపడ్తున్న నేను నాదేరైటని బల్లగుద్ది చెప్పబోను గాని నాది రైటా. రాంగా అని ప్రశ్నిస్తున్నాను. మారవలసింది ఏ ఒక్కరోకాదు అందరూ మారాలి. ఏ పరభాషా చిత్రాలనో పొగుడుతుంటూ. మనల్ని మనమే పదే. పదే విమర్శించుకొనేంత మూర్ఖాన అయిపోదు. ఉత్తమచిత్రాలు మాత్రం ప్రేక్షకులు ప్రోత్సహించి. ఆదరించి తీరాలి, మరువకూడదు. ఈ సందర్భంలోనే 'సుడిగుండాలు' వంటి చిత్రాన్ని మనం ఎంత (ఆర్థికంగా) విజయవంతం గావించామో కూడా అడగడం అప్రస్తుతం కాదనుకుంటాను.

అందువల్ల, మరోసారి, నేననేదేమిటంటే ప్రయోగాత్మక, ప్రయోజనాత్మక, ప్రబోధాత్మక చిత్రాలు రావాలంటే అందరూ మారాలి.

—ఎన్. వి. ఎస్. ఎన్. మూర్తి.

(బరంపురం-1)

